శ్రీరస్తు

శ్రీగంగాధరాచార్యకృత

# భేషజకల్పము

## సాంధ్రతాత్పర్యము



(క్రొత్తకూర్పు)

చెన్నపురి
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే
ప్రకటితము
1950

తత్రాఽపి శిశిరే సౌమ్యం గ్రీష్మే త్వాగ్నేయ మిష్యతే,

పూర్వపుమూలిక లన్నిటిలోను శిశిరర్తువునందు శీతవీర్యంబు లగు వానిని, గ్రీష్మర్తువునం దుష్ణవీర్యంబు లగువానిని గ్రహింపవలెను

సారం హిమాగమే కందత్వక్ క్షీరాణి ఘనాత్యయే 39

హేమంతర్తువునందు చేవలను శరదృతువునందు దుంపలను, పట్టను, పాలను గ్రహింపవలెను

పుష్పం ఫలం యథర్త్వేవమవ్యాపన్న గుణం భవేత్,

పుష్పలు కాయలు నేఋతువునం దెయ్యవిదొరకునో యాఋతువునందే వానిని గ్రహింపవలెను ఇట్టియినచో చెడనిగుణంబులఁగలిగియుండును

సర్వర్తుకా కాండ నాళ శృంగ స్వరస పల్లవా 40
క్షార ప్రరోహా నిర్యాస భస్మ తైలాని కంటకా

బోదెలు, కాడలు, ఊడలు, స్వరసములు, చిగురుటాకులు క్షారములు, మొలకలు బంకలు, భస్మము, తైలము, ముండ్లు, ఇవి అన్నిఋతువుల యందును గ్రహింపవచ్చును

సౌమ్యర్తుష్వథ వాసౌమ్యం స్వాదుతిక్తకషాయకమ్ 41
అన్యదన్యర్తుగం గ్రాహ్యమమ్లం లవణమూషణామ్

సౌమ్యర్తువులందు శీతవీర్యంబులగు స్వాదు (తీపి) తిక్త (చేదు) కషాయ (ఒగరు) రసంబులుగల పదార్థములను ఆగ్నేయర్తువులందు నుష్ణవీర్యంబులగు అమ్ల (పులుసు) లవణ (ఉప్పు), ఊషణ (కారము) రసంబులుగల పదార్థంబులను గ్రహింపవలెను

అన్యమతము

ప్రావృట్ఛీత శర ద్ధేమ వసంతోష్ణాగమ ర్తుషు,
క్రమేణ మూల ఽత్ర త్వ జ్నిర్యాస క్షీర సారకాన్ 42
ఆదదీత ఫలం పుష్పం యథర్త్వి త్యపరే విదు,

కొందరాచార్యులు వర్షర్తువునందు వేళ్లను, శిశిరర్తువున దాకులను, శరదృతువునందు పట్టను, హేమంతర్తువునందు బాకను వసంతర్తువునందు పాలను, గ్రీష్మర్తువునందు చేవను గ్రహింపవలెను పువ్వులను కాయలను అయ్యవిదొరకు ఋతువులందే గ్రహింపవలెను అని చెప్పుచున్నారు

### సౌమ్యాగ్నేయౌషధోత్పత్తిదేశము

హిమవద్వింధ్యశైలాభ్యాం ప్రాయోవ్యాప్తం మహౌషధమ్
సౌమ్యంజాతంచతత్రాద్యేత్వాగ్నేయం వైంధ్యమౌషధమ్

హిమవత్పర్వతమునుండియు వింధ్యపర్వతమునుండియు మంచియోషధియంతయు వ్యాప్తమైనది అందు హిమవత్పర్వతమందలియౌషధము సౌమ్యమైనవి వింధ్యపర్వతమునఁ బుట్టినది ఉష్ణవీర్యంబుకలదై యుండును

### కందమూలాద్యౌషధగ్రహణవిధి

తద్గ్రాహ్యం కందమూలాద్యై ర్యద్య దుక్త మిహాసారవత్

ఏయోషధులలో నేవి సారంబులుగాఁ జెప్పఁబడునో యాయా భాగముల గ్రహింపవలెను

### కందసారములు

కందసారా స్తు మంజిష్ఠా కుష్ఠ చోర విదారికా,
హరిద్రా లాంగలీ ముస్తా వరీ రాస్నా గుణప్రియా 45
శారివాద్రిక వారాహీ వచాఽబ్ద వనసూరణా,
నికుంభ మూర్వాగ్ని కాఽఖ్యా వాజిగంధా శుకాసనాః 45

మంజిష్ఠ, చెంగల్వకోష్టు, కచోరము నేలగుమ్మడి పసుపు, చపాత్తి, తుంగగడ్డలు ఎల్లపీచర సన్నరాస్నము అతివస, సుగంధిపాల, అల్లము, నేలతాఁడి, వస, భద్రముస్తలు అడవికంద తెల్లతెగడ, చాఁగ, పుల్లప్రబ్బలి, పెన్నేరు, చేను, వేగిస, ఇవి కందసారములు అనఁగా గడ్డలే సారముగలవై యుండును

## మూలసారములు

బృహ త్యంశుమతీ ద్వంద్వ బలా పంచక బర్బరా,
తండులీయక గోకంట కుండలీ ద్విపునర్న వే 47
పుంఖి వాలక లామజ్జా యాసోఽహింస్రా సువర్చలా,
పారా కురంట శ్యామాద్యా మూలసారా ప్రకీర్తితా

పెద్దములక చిన్నములక ముయ్యాకుపొన్న కోలపొన్న బలాపంచకము (బల, అతిబల, నాగబల, మహాబల రాజబల), వాయింట, చిట్టి చిరినల్లేరు ఉప్పు తెల్లగలిజేరు ఎఱ్ఱగలిజేరు సదాప కురువేరు వట్టివేరు దూల కొండి, ఆదొండ, ప్రొద్దుతిరుగుడుచెట్టు, చిరుబొద్ది గోరింట, నల్లతెగడ, ఇత్యాదులు వేళ్లసారము గలవిగా తెలియందగు

## మూలత్వక్సారములు

శ్యామారాస్నాఽగ్నినీలాద్యామూలత్వక్సారకాస్స్మృతా,

నల్లతెగడ, సన్నరాస్నము, చిత్రమూలము నీలి ఈ మొదలయినవి వేళ్లపైనుండుపట్టయే సారముగాఁ గలవియని యెఱుంగునది

## దారుత్వక్సారములు

లోధ్రారిమేద కట్వంగదార్వీ జంబు లవంగకాః 49
కరంజ కింశుకద్వంద్వ శ్యామాక ప్లక్షవృక్షకా,
శాల్మలీ కుటజాద్యాశ్చ దారుత్వక్సారకా స్స్మృతా 50

లొద్దుగ తుమ్మ పెద్దమ్రాను మ్రానిపసుపు నేరేడు, లవంగము, క్రానుగు, తెల్లమోదుగు, ఎఱ్ఱ మోదుగు, రేల, జువ్వి బూరుగు, కొడిశ ఈ మొదలైనవి మ్రాని యొక్క పట్టయే సారంబుగాఁగలవి

## సారసారములు

మధూక చందనద్వంద్వ రోహిణ్యమర ఘూరుహా,
ఖదిరాసన నింబాద్యా స్సర్వే తేసారసారకాః 51

ఇప్ప, చందనము, రక్తచందనము, పోమిద దేవదారు, చంద్ర, వేగిస, వేప మొదలగునవి చేవయే సారంబుగలవిగానుండును

— పత్త్రసారములు —

భృంగాఽలర్కా ఝటా ఝింటీహారి స్మంజరికాఽమ్లికా,
ఉపానదంష్ట్రి ధత్తూర కారవేల్ల పటోలకః 52
నిర్గుండీ మత్స్యక్షద్భ్రుఙ్మండీ కుండలీ కాసమర్దక,
మండూకపర్ణీ లవణీ తలపో తార్క్ష కింశుకాః 53
జయాఽగ్ని మంథా చాంగేరీ శార్ఙ్గేష్టా ద్విపునర్నవే,
బ్రాహ్మీ కురంట కాంతౌ చ సహదేవీ హరిప్రియా 54
లక్ష్మీదదీయా జీవంతీ దూర్వాఽవల్గుజ వాస్తుకమ్,
పుష్పాఽఖుపర్ణీ కాళిందీ నింబాద్యా పత్త్రసారకా 55

గుంటగలగర, తెల్లజిల్లేడు నేలయుసిరిక ములుగోరింట మూరు కొండ, చింత, చప్పుతట్ట ఉమ్మెత, కాకర, చేదుపొట్ల వావిలి పొన్నగంటి, బోడతరము ఉప్పు కసింద ఎద్దునాలిక, ఊదుగు, తంగేడు జిల్లేడు, మోదుగ తక్కాల కూరనెల్లి చుక్కకూర గినియ, తెల్లగలిజేరు, ఎఱ్ఱగలిజేరు సరస్వతి యాకు గోరింట, కుంకుడు సహదేవి, విష్ణుక్రాంతము మారేడు, ఎఱ్ఱచిత్ర మూలము, పాల, గరిక, గచ్చ చెంచలి స్థౌణేయము ఎలుకచెవియాకు పుచ్చ వేప ఈ మొదలగునవి పత్త్రములే (ఆకులు) సారముగలవిగా నుండును

— పుష్పసారములు —

పుష్పసారాస్తు చాంపేయ కేత కాశోక పాటలాః,
పున్నాగ భూర్జ వకుళ మాధవీ జాతిమల్లికా 56
శేఫాలీ యూధికా శిగ్రు శతపత్త్ర నృపద్రుమాః,
వరాళా ధాతకీ నంద్యావర్తోత్పల జపాదయ 57

సంపంగి, మొగలి, అశోకము, పాదిరి పొన్న భుజపత్త్రి, పొగడ, కురువింద జాజి, మల్లి వావిలి, మొల్ల మునగ, సదాప రేల, లవంగము, అరి సంగార్ధనము కలువ, దాసాని ఈ మొదలగునవి పువ్వులే సారంబుగాఁ గలవి

## ఫలసారములు

ద్రాక్షా దాడిమ ఖర్జూర రంభా పనస చూతకా,
తాళీస బిల్వ తుంగద్రు శ్లేష్మాతక కపిత్థకా 58
నారంగ లుంగ లికుచ పారేవత ప్రియాళుకా,
సుర సౌవీర బదరీ గుంజా కర్కంధు తోరణా (?) 59
వల్లీఫలాదయ శ్చాన్యే ఫలసారాః ప్రకీర్తితా,

ద్రాక్ష, దానిమ్మ ఖర్జూరము, అరటి పనస, మామిడి, తాటి, మారేడు, కొబ్బరి, విరిగి, వెలగ, నారింజ, మాదీఫలము, నిమ్మ ఈడె, మొరలి, కమ్మరేగు, చిన్నరేగు గురువింద, గంగరేగు తోరణము (?) ఈ మొదలయినవియు, తీగల నుండి పుట్టిన గుమ్మడి అనప మొదలైనవియుఁ ఫలములే సారంబుగాఁగలవి

## బీజసారంబులు

రక్తాద్యా శ్శాలయ స్తద్వ న్ముద్గాద్యా శ్శింబిజాతయ 60
ఏరండయుగ్మ పున్నాగ నగ్నచి చ్చక్రమర్దకా,
ప్రియాళు నింబ వకుళ మునిశిగ్రు కరంజికా 61
జ్యోతిష్మతీ కుబేరాక్షీ శంఖినీయుగ్మ చూతకా,
జాతీఫలం చ తక్కోలం బ్రహ్మద్రుమ మయూరకా 62
పిప్పలీ మరిచాఽజాజీ యవానీ ధాన్యసర్షపా,
కతకాఽరుష్కరా జాతీపథ్యా ధాత్రీ విభీతకా 63
వాకుచ్యంకోల బదరీ వేల్లాద్యా బీజసారకాః,

ఎఱ్ఱవరి మొదలగు ధాన్యములును, మినుములు, పెసలు మొదలగు శింబీ ధాన్యములును, చిట్టియాముదము, పెద్దయాముదము పొన్న, ప్రత్తిచెట్టు, తగిరిసె, చారపప్పు, వేప పొగడ అగిసె మునగ క్రానుగ జ్యోతిష్మతి, (మాల కంగిని) గచ్చ తెల్లగంటెన నల్లగంటెన, మామిడి, జాజికాయ, తక్కోలము, మోదుగు, కుక్కవాయింట, ఎప్పలి మిరియము, జీలకఱ్ఱ ఓమము దనియాలు, ఆవాలు, చిల్లగింజ, జీడి, ఎన్నుయునరిక, కరక ఉశిరిక తానికాయ బావంచి ఊడుగ, రేగు, వాయువిళంగములు ఈ మొదలగునవి బీజంబులే సారంబుగా గలవి

## క్షారసారములు

త్రివృచ్చిత్రక గండీర పూతికా ద్విపునర్నవే, 64
చవ్యాటరూష శ్యోనాక పాటలీ పారిభద్రకా,
పరకన్యార్క వార్తాక పాలా శోదర (?) కింశుకా 65
గవాక్షీ శంఖినీ శూర్పీ నిర్గుండీ కుండలీ నిశా,
నీలినీ కేతకీ ముండీ ప్రత్యక్పుష్పాజగంధికా 66
అలర్క బర్బరద్వంద్వ తిలే క్షురక వేతసా,
శింశుపార్జున దేవాహ్వశిగ్రు ముష్కర భూస్తృణా
క్షారసారా భవంత్యేతే క్షారసాధ్యేషు సిద్ధిదా

తెగడ చిత్రమూలము జెముడు క్రానుగ, ఎఱ్ఱగలిజేరు, తెల్లగలిజేరు, చవ్యము, అడ్డసరము, దుండిగము, పాదిరి వేము, నేపాళము, జిల్లేడు, వంగ, ములుమోదుగ, మోదుగ, పాపర గంటెన, అడవిపెసర, వావిలి, ఉప్పుపసుపు, నీలి మొగలి, బోడతరము, ఉత్తరేణి, అడవివాయింట, తెల్లజిల్లేడు, వాయింట కుక్కవాయింట, నువ్వులు, నీటిగొబ్బి, నీటిప్రబ్బలి, శింశుప, మద్ది దేవదారు మునగ మొక్కపుచెట్టు, కామంచి ఈ మొదలగునవి క్షారమే సారంబుగాఁ గలిగియున్నవి క్షారసాధ్యకర్మయందు వీనిబ్రయోగించిన సిద్ధిప్రదంబులై యుండును

### క్షీరసారములు

తిల్వకాఽర్క మహావృక్షా పత్త్రస్నుగ్గిరికర్ణికా 68
ఆస్ఫోత క్షీరవృక్షాద్యాః క్షీరసారా భవంతి తే,

లొద్దుగు, జిల్లేడు, పెద్దజెముడు, ఆకుజెముడు, తెల్లగినియ, తెల్ల జిల్లేడు, మఱియుం నిట్టి మఱ్ఱిమొదలగు పాలచెట్టు లన్నియుం పాలే సారంబుగాఁగలవియై యుండును

### నిర్యాససారములు

స్థౌణేయసర్జ శ్రీవాస దేవధూప తురుష్కకా 69
పాలాశ శాల్మలీ గుగ్గు ల్వరిష్ట గుడకాదయః,
కించాఽరగ్వధ మేహారి కపిత్థ ఖది రాసనః 70
అరిమేదద్వయాంబష్ఠ చోళ భిల్వాహి ఫేనకా,

స్థౌణేయము, గుగ్గిలము, దేవదారుబంక, మహిసాక్షి తురుష్కము, మోదుగు బూరుగు, తెల్లగుగ్గిలము, వేము, ఇప్ప, రేల, తంగేడు, వెలగ, చండ్ర వెంగి తుమ్మ కంపుతుమ్మ ఇంగువ, మునగ కాకిమారేడు, అహిఫేనము ఇవి నిర్యాసము (బంక) సారముగాఁ గల్గియున్నవి

### సర్వాంగసారములు

సర్వాంగసారాశ్చ తథా భృంగ కన్యా పటోలకాః 71
పిప్పలీ మూల భూనింబ నత చవ్య పరూషకాః,
దూర్వా ప్రసారణ్యాఖ్యాతా చాంగేరీ పాటలాదయ 72

గుంటగలగర, కలబంద, చేదుపొట్ల పిప్పలీమూలము, నేలవేము, గ్రంథితగరము, చవ్యము, చిట్టీత, గఱిక గొంతెమగోరు, (సీతమ్మ సవరమని కొందఱు) పులిచింత, పాదిరి ఈ మొదలగునవి సర్వాంగసారంబు లనఁబడును. అనగా పైనఁ జెప్పఁబడినమూలము, పత్త్రము, త్వక్కు మొదలగునవి యన్నియుం సారంబులుగాఁగలవి

కందమూలైశ్చ మూలత్వగ్దారుత్వగ్గ్రాహ్యసారకాః,
పత్రపుష్పఫలైర్బీజైః క్షారేణ క్షీరకైస్తథా 73
నిర్యాససారైస్సర్వాంగైస్సారవంతిచ భూయసా
తత్తద్రోగోపశమనక్రియాసిద్ధి విశేషత 74
ఔషధాని స్వవర్గేషు విందాత్ శ్రేష్ఠాంస్తు కారయేత్,

పూర్వము దుంపలు వేళ్లు వేరుపట్ట మ్రానుపట్ట ఆకులు పువ్వు, పండ్లు, గింజలు క్షారములు క్షీరము నిర్యాసము వీనిచే సారంబుగలవస్తువులు చెప్పబడియె ఇట్టిపదార్థముల సారమును వేర్వేఱుగా గ్రహించి యాయా యౌషధములయందుఁ బ్రయోగించిన సిద్ధిం గలుగఁజేయును

ఔషధస్థాపనము

గృహీత్వాఽఽరోగ్యశాలాయాం శ్లాఘ్యసంభాగసంపది
శుద్ధానురూపగుణవ ద్భాజనస్థ మనిందితమ్,
జలోపస్నేహధూమాగ్నిరజోభి రనుపాహతమ్ 76
కీటై రనభిగమ్యం చ మూషకైశ్చ చతుష్పదైః,
న బిలేశయసంఛన్నం స్థాపయేత్సర్వ మౌషధమ్ 77

సంపాదితంబైన యౌషధిని పరిశుద్ధమైతగియున్నపాత్రయందుంచి నీరు, చెమ్మ, పొగ అగ్ని ధూళి మొదలగునవి సోకకుండునట్లును పురుగులు ఎలుకలు నితరమృగములు, పాములు మొదలైనవి ముట్టకుండునట్లు జాగ్రత చేసి చెప్పఁబోవులక్షణంబులు గల యారోగ్యశాలయం దుంచవలెను

ఆరోగ్యశాలానిర్మాణలక్షణం సంప్రకాశ్యతే,

ఆరోగ్యశాలను కట్టునట్టి విధానము చెప్పఁబడుచున్నది

ఆరోగ్యశాలానిర్మాణము

అథ సాధారణే దేశే వివిధౌషధవీరుధి 78

దేశే నదీవనాద్రీణాం నాతిదూరే నిరామయే,
ప్రాగుదీచ్యోర్దిశో ర్భాగే ప్రశస్తాం వాస్తువిస్తరె 79
గుప్తాం పూర్వోత్తరద్వారాం గంధపుష్పోపహారిణీమ్,
సమాంశవాతాం సర్వత్ర ప్రవాతా మేకదేశత 80
సర్వోపకరణై ర్యుక్తాం సర్వేష్టతతిశోభితామ్,
ఆరోగ్యశాలాం కుర్వీత నిత్యాగ్న్యస్తబలిక్రియామ్ 81

వివిధవృక్షలతాదులచే శోభించుచున్న సాధారణదేశంబునందు నదులకు వనంబులకుఁ బర్వతంబులకుఁ గొలఁదిదూరంబున నిరామయంబగు ప్రదేశంబునఁ దూర్పు ఉత్తరపు దిక్కులచెంత వాస్తుశాస్త్రానుకూలంబై గంధపుష్పాదులచే నొప్పారుచు నంతటను సమంబుగా వీచుచున్న గాలిగలిగి యొక్కచో మాత్రము మిగులగాలికలదై యాయుర్వేదోపకరణంబులచే సంపూర్ణంబై యిష్టజనసంసేవితంబై ప్రతిదినము బలిదానాదులచే దూరీకృతభూతగ్రహాదికంబై పూర్వోత్తరద్వారంబులు కలిగియుండు నారోగ్యశాలను నిర్మింపవలెను

### ఆరోగ్యశాలయందు దేవతాస్థాపనక్రమము

మధ్యే సంస్థాపయేత్తత్ర బ్రహ్మస్తంభం త్రయీమయమ్,
చతురశ్ర మధో మధ్యే షడశ్రం వృత్త మగ్రత 82
శిల్పిశాస్త్రవినిర్దిష్టం బ్రహ్మవిష్ణుశివాత్మకమ్,
తదగ్రే తు మహాపద్మం షోడశస్వరకేసరమ్ 83
తన్మధ్యే పరమాత్మానం పరమామృత మచ్యుతమ్,
నిమిత్తమాత్రం సర్వేషాం వేద్యం వేదాంతిసత్తమై 84
బ్రహ్మాణ ముత్తరే కుర్యాత్పద్మవర్ణం చతుర్ముఖమ్,
దక్షాదిసూత్రకారాంశ్చ దీప్యమానాన్ స్వతేజసా 85
శ్రీవత్సకౌస్తుభం దేవం శ్రీసహాయం చ దక్షిణే,
గరుడం చ విహంగేంద్రం త్రినేత్రం ఫణిభూషణమ్ 86

వామదక్షిణహస్తాభ్యాం సుధాపాత్రాసిధారిణం
ఆజానుపింగ మానాభి సిత మారక్తమాగళమ్ 87
ఆశీర్ష నీల మరుణం హస్తపాదతలేషు చ,
అశ్వినౌ పశ్చిమే భాగే సర్వాభరణభూషితౌ 88
ఏకసింహాసనాసీనౌ వృషౌహంసోపవీతినౌ,
పుస్తకాభయహస్తాఢ్యౌ హేమపుష్కరధారిణౌ 89
దాడిమీపుష్పసంకాశౌ జటామకుటధారిణౌ,
ఆయుర్వేదప్రణేతార మాత్రేయం తస్య దక్షిణే 90
వామే ధన్వంతరిం దీప్తం వరదం విశదాంబరమ్,
అమృతాపూర్ణ సౌవర్ణకమండలులసత్కరమ్ 91
పశ్చా ద్విశల్యకరణీం మృతసంజీవినీం పురః,
ద్వారదేశే గణాధీశం దుర్గాం శశిదివాకరౌ 92
సర్వోపచారై ర్వేదోక్తైస్సర్వానేతాన్ సమర్చయేత్,

చెప్పఁబడిన తీరున నిర్మింపఁబడిన యారోగ్యశాలలో మధ్యభాగంబునఁ త్రిమూర్త్యాత్మకంబై క్రిందిభాగమునఁ జతుష్కోణంబై మధ్యభాగంబున షట్కోణంబై, యగ్రభాగమున మండలాకారంబై, శిల్పశాస్త్రానుకూలంబై యొప్పుచుండు బ్రహ్మస్తంభమును స్థాపింపవలయును దానియగ్రభాగంబున అకారాదిస్వరములు పదునారును లిఖింపబడిన షోడశదళోపేతంబగుపద్మమును నిర్మించి దానియందు వేదాంతులచే నిరతంబుఁ దెలియ బడుచు, భూతసృష్టికి నిమిత్తకారణుండగు, అమృతరూపుడగు పరమాత్మను నిలిపి, యాస్తంభంబున కుత్తరదిశను జతుర్ముఖుండగుచుఁ బద్మకాంతిచే శోభించు బ్రహ్మను స్థాపించి యాదిశనే సూత్రకారులగు దక్షాదులను స్థాపింపవలయును ఆకంబంబునకు దక్షిణదిశను శ్రీవత్సకౌస్తుభాలంకృతుండగుచు లక్ష్మీ

సహాయుండగు విష్ణుదేవుని నిల్పి, దానిపడమటిదిక్కున నెడమచేత సుధాకలశంబును, గుడిచేతఁ గత్తిని గ్రహించి, మోకాటివఱకుఁ బచ్చనగుచు, నాభివఱకుఁ దెల్లనగుచు, కంఠపర్యంత మెఱ్ఱనగుచు, శిరంబువఱకు నల్లనగుచు, హస్తపాదతలంబుల గొంచెముగా నెఱ్ఱనగుచుఁ దనదివ్యతేజంబుఁ బ్రజ్వరిల్లుచు మూఁడుకండ్లుగల ఫణిభూషణుండగు గరుడదేవుని సర్వాభరణభూషితులై యొక్కసింహాసనము నధిష్ఠించి దానిమ్మపువ్వుంబోలు కాంతిగలవారై, జటాధారులగుచుఁ, బద్మమాలికల నొప్పారు కంఠములుగలిగి, యజ్ఞోపవీతంబుల ధరియించి, కరంబులయందుఁ బొత్తంబుల ధరించి యభయదానంబుఁ జేయుచుండు నశ్వినీదేవతలను, వారిదక్షిణపార్శ్వంబున నాయుర్వేదకర్తయగుచు, నమృతకలశంబుఁ గరంబున నిడికొనియుండు ధన్వంతరి మహర్షిని యాతని వెనుకభాగమున విశల్యకరణిని, ముందున రోగములం బాపుఅమృతసంజీవినిని, ద్వారంబుకడ విఘ్నేశ్వరుని, నాతనిపొంత దుర్గను జంద్రుని, సూర్యుని స్థాపించి, వేదచోదితంబులగు సర్వోపచారంబులం బూజింపవలయును

## ఔషధపచనాగారము

తస్య ప్రాగ్దక్షిణే భాగే సర్వోపకరణాన్వితమ్ 93
బహువాతాయనచ్ఛిద్రం విశ్వాసిజనసేవితమ్,
స్వర్వేషా మౌషధాదీనాం పచనాగార మిష్యతే 94

ఆయారోగ్యశాలకు నాగ్నేయభాగమున నాయుర్వేదోపకరణంబులచేఁ బూర్ణంబై యనేకగవాక్షములు కలిగి నమ్మికగలవారితోఁ గూడి యౌషధములను వండి సిద్ధముచేయుట కనుకూలంబగు గృహ ముండవలయును.

## పరిమాణము

తత్రౌషధం యథాయోగం మాత్రావచ్చ ప్రకల్పయేత్,

అట్టి పచనాగారంబున సిద్ధంబుచేయు నౌషధంబుల నేయోగంబున నెట్టిపరిమాణ మావశ్యకమో యెఱింగి యాప్రకారము సిద్ధము చేయవలయును

## ఓషధులకు గుణహీనకాలనిర్ణయము

సత్ క్షీరరససంపన్న మనతిక్రాంతవత్సరమ్ 95
ఋతే ఘృతగుడక్షౌద్రధాన్యకృష్ణా విడంగత,
వర్షాత్పరం వరాళాద్య మన్యద్గంధపరిక్షయాత్ 96

నేయి బెల్లము తేనె, దనియాలు ఎప్పళ్లు వాయువిళంగములు ఇవి తక్క మిగిలిన క్షీరముతోఁ గూడినట్టివియుం రసంబుతోఁ గూడి నట్టివియు నై యౌషధంబుల సంవత్సరమునకుఁ బూర్వమే యుపయోగించవలెను లవంగము మొదలగు పుష్పములను సంవత్సరమునకు దరువాతఁ గూడ నుపయోగింపవచ్చును ఇతరమగు పుష్పములను పరిమళము పోకపూర్వమే వినియోగింపవలెను

ఫలపత్త్రాదికం వర్షాత్ దారుకాండం ద్వివర్షత,
మూలం త్రివర్షాద్బీజం చ సారో వత్సరపంచకాత్ 97
నిర్యాసో దశమా ద్వర్షా దత ఊర్ధ్వం న శస్యతే,

ఫలములు, పత్త్రములు మొదలగునవి సంవత్సరమునకుఁ బిమ్మట గుణహీనంబులగును ప్రాఁక తామరకాఁడ మొదలగునవి రెండుసంవత్సరంబులకు దర్వాత నిర్గుణంబులగును వేళ్లు గింజలు మూఁడేండ్లు పిమ్మట నిస్సారంబులగును సారము (చేవ) అయిదువత్సరంబుల పిమ్మట నిస్సారమగును నిర్యాసము (బంక) పదివత్సరములతర్వాత గుణహీనంబగును తరువాత నాయావస్తువులు గుణహీనములై యుపయోగింపఁదగవు

## క్షీరాదిగ్రహణ నిర్ణయము

పచ్చిగనే యుపయోగింపఁదగు నోషధులు —

వాశా కుటజ కూశ్మాండ శతావర్యమృతా లతా 98
కురం బైరండ లశున ఖర్జూర బిస కత్తృణాః
పంచమూలం లఘుమహా త్తృణాఖ్యం మాంస మార్ద్రికమ్

శారి వాంబు ఘ నోశీర కమలం కంద మౌషధమ్,
నిత్యార్ద్రమేవ యోజ్యం స్యాత్తథా శుష్కం న వీర్యదమ్

అడ్డసరము, కొడిశపాల, గుమ్మడికాయ, పిల్లిపీచర తిప్పతీగ, గోరింట, ఆముదము, ఉల్లి ఖర్జూరపుపండు తామరకాడలు కామంచి కసవు, లఘుపంచమూలము (ముయ్యాకుపొన్న కోలపొన్న వాకుడు, పెద్దములక పల్లేరు)మహాపంచమూలము (మారేడు పెద్దమ్రాను, గుమ్ముడు కలిగొట్టుచెట్టు తక్కెల), తృణపంచమూలము (కుశలు రెల్లు కాకిరెల్లు, దర్భ, చెఱకు), మాంసము అల్లము సుగంధిపాల కురువేరు తుంగముస్తలు వట్టివేరు తామర పూలు మఱియు గడ్డలు ఈయోషధుల నన్నిటిని పచ్చిగా నున్నపుడే యుపయోగింపవలయును ఎండినచో వీర్యముచెడును

నిస్త్వగౌషధములు

నిస్త్వక్పుంర్యమృతాऽభీరు లశునం బిల్వపంచకమ్,
శతావరి హరిద్రా చ నిస్త్వగేవ ప్రశస్యతే 101

శుంఠి తిప్పతీగ తెల్ల ల్లిపిచర ల్లుల్లి బిల్వపంచకము * (మారేడు తక్కెల దుందిలము గుమ్ముడు, కలిగొట్టు) ల్లిపీచర పసుపు యీద్రవ్యము లను పైతోలు దీసి యుపయోగింపవలయును

ముద్గాదిప్రయోగనియమము

ముద్గాద్యాస్సత్వచో యోగ్యాః భక్ష్యే దాని స్త్వచో హితా,
కంగుణా వేల్ల తువరీ సర్షపాద్యాస్తు నిస్తుషాః 102

పెసలు కందులు, ఉలవలు, సెనగలు మొదలగు వానిని కట్టుగాచు నపుడు పొట్టుతో నుపయోగింపవలయును భక్ష్యములు జేయునపుడు పొట్టు

* అయిదువిధములైన మారేడులని యాంధ్రభేషజ కల్పమునందు వ్రాయబడినది

తీసి చేర్పవలెను మఱియు నేపాళపువిత్తులు వాయువిళంగములు, నీరుడిగింజలు ఆవాలు మొదలగువానిని పొట్టుతీసియె యుపయోగింపవలెను

## అనిర్దిష్టద్రవ్యములయందు విశేషద్రవ్యములు

అనిర్దిష్టాఽప్రసిద్ధేషు మూలం గ్రాహ్యం త్వగాదిషు,
మూలవీర్యా హి భూయిష్ఠ మోషధీ పరిచక్షతే 104
మూలాలాభే తు దాతవ్యం మూలతుల్యగుణం చ యత్,

గ్రంథకారు లౌషధయోగంబులందు ఆకు, వేరు, పువ్వు పాలు, కొమ్మ బంక ఇత్యాదిభేదంబులఁ జెప్పకుండినచో నచ్చట సర్వాంగములలో శ్రేష్ఠంబగుటచే మూలమే ప్రయోగింపందగు అట్లు మూలముగూడ దొరకనిచో దానిగుణంబుకల మఱియేయంగమునైన గ్రహింపఁదగును

## అభావప్రతినిధివర్గము

ఖర్జూరం వా మధూకం వా ద్రాక్షాభావే దురాలభామ్
పిప్పల్యా మ్మరిచం శుంఠ్యా మార్ద్రికం కణమూషణే,
రాస్నాయాం నాగరం కుష్ఠే జటామున్స్తే కుటంనటమ్ 105
వరాళే ధాతకీపుష్పం జీరకే కృష్ణజీరకమ్,

ద్రాక్షపండులేనిచో ఖర్జూరపుపండునుగాని ఇప్పపువ్వునుగాని, దూలగొండినిగాని ఎప్పళ్లులేనిచో మిరియములను, శుంఠిలేనిచో నల్లమును, మిరియములు లేనిచోఁ బిప్పళ్లు సన్నరాస్నములేనిచో శుంఠిని,చెంగల్వకోష్టులేనిచో జటామాంసిని తుంగముస్తలులేనిచో గ్రంథితగరమును, లవంగములేనిచో ధాతకీపుష్పమును తెల్లజీలకఱ్ఱలేనిచో నల్లజీలకఱ్ఱను గ్రహింపందగును

భార్గ్యాంనిదిగ్ధికామూల మేలాం తాళీసపత్రకే 106
పౌష్కరస్య మృణాలం వా కుంకుమే పద్మకేసరమ్,
అష్టవర్గేషు జీవంతీ మధూకం వా బలాత్రయమ్ 107

గుగ్గులో ర్నింబనిర్యాసం సైంధవం లవణాంతరే

గంటుభారంగిలేనిచో వాకుడువేరును తాళిసపత్త్రిలేనిచో ఏలకులును, పుష్కరమూలములేనిచో తామరతూడును, కుంకుమపువ్వులేనిచో పద్మకేసరములును, అష్టవర్గములేనిచో పాలచెట్టునుగాని యష్టిమధుకమునుగాని ఒలాయమునుగాని మహిసాక్షి గుగ్గిలములేనిచో వేపబంకను, ఇతరంబులగు లవణంబులులేనిచో సైంధవలవణమును గ్రహింపఁదగును

కాలనాభే తు వర్షాభూస్తదభావే శినాడికా 108
కరంజయుగ్మం కట్వంగె చిత్రమూల మరుష్కరే,
కపిత్థం బిల్వమూలాదౌ బలాయాం మహతీ బలా 109
దురాలభా ధన్వయాసే పారాయాం ధన్వయాసకమ్,

కరివేపలేనిచో గలిజేరును, అదియులేనిచో నటికమామిడిని, పెద్దమ్రానులేనిచో రెండుక్రానుగలను నల్లజీడిగింజలులేనిచో చిత్రమూలమును, మారేడువేరులేనిచో వెలగవేరును చిట్టాముట్టిలేనిచో పేరాముట్టిని తెల్లకాయలదూలగొండిలేనిచో యెఱ్ఱగాయల దూలగొండిని చిరుబొద్దిలేనిచో దురదగొండిని గ్రహింపఁదగును

నిదిగ్ధికాయాం బృహతీ కింశుకం బ్రహ్మభూరుహే 110
గ్రంథికే మరిచం చవ్యం గండీరే బర్బరద్వయమ్,
లామజ్జకే మలయజ ముశీరే గోపకన్యకా 111
దంత్యాశ్రీవృ చ్చిత్రకం వా హారీతక్యాం విభీతకమ్,

వాకుడులేనిచో పెద్దములకవేరును బ్రహ్మమేడిలేకున్న మోదుగను, గ్రంథితగరములేనిచో మిరియమును, జెముడులేనిచో చవ్యమును, తెల్లవాయింటలేనిచో కుక్కవాయింటను నల్లవట్టివేరులేనిచో శ్రీగంధమును, వట్టివేరులేనిచో సుగంధిపాలను, నేపాళములేనిచో తెగడనుగాని, చిత్రమూలమునుగాని, కరకకాయలేనిచో తాడికాయను గ్రహింపవలయును

శర్కరాభావే గుడం క్షౌద్రే పురాణం గుడ మిష్యతే 112
అజం గవ్యే పయ స్సాజ్యే మాహిషేచావికంపయః,
క్షీరాభావే భవేన్ముద్గో యూషో మాసూర ఏవవా 113
మసూరయూషయో క్షీరం వ్రీహయశ్శాలిజాతిషు,

పంచదారలేనిచో బెల్లమును తేనెలేనిచోఁ బ్రాతబెల్లమును, ఆవు పాలుగాని, ఆవునేయిగాని లేనిచో మేకపాలు మేకనేయి బఱ్ఱెపాలు లేనిచో గొఱ్ఱెపాలను పాలులేనిచో పెసరకట్టునుగాని, చిఱుసెనగకట్టునుగాని చిఱు సెనగల యూషము లేనిచో పాలనుగాని రాజనాలు లేకున్న నితర ధాన్యము గాని గ్రహింపదగును

తైలే ష్వైరండజం తైలం రక్తైరండభవం తథా 114
మయూర కుక్కుటాభావే కుక్కుటాశ్చాపి బర్హిణ,
మాంసేషు మత్స్యమత్స్యేషు శంబూకా స్తేషుశుక్తయ
సువర్ణే రజతం లోహం రజతం తదభావత,
అన్యోన్య మేవ మర్యాదా ద్రవ్యం యుక్తం ప్రకల్పయేత్

తైలములేనిచో ఆముదము తెల్లయాముదములేనిచో ఎఱ్ఱయాముదము, కోడిమాంసములేనిచో నెమిలిమాంసము నెమిలిమాంసములేనిచో కోడి మాంసము, మాంసములేనిచో మత్స్యమాంసము,మత్స్యములేనిచో గుల్లల పురుగులు అవిలేనిచో నాలుచిప్పల పురుగులును గ్రహింపదగును సువర్ణ ములేనిచో రజతమును నదిలేనిచో లోహమును లోహములేనిచో రజత మును, గ్రహింపఁదగును ఈచెప్పినప్రకార ముపయోగించుచు, వీనిలో నొకటి లేనిచో మఱియొకటిగాఁ బరస్పర ముపయోగించుచు, నదియును లేనిచో యేద్రవ్యముయొక్క రసవీర్యవిపాకంబులకు సమానంబగు మఱియొక ద్రవ్య మునుగాని గ్రహించుచు నాయాయౌషధనిర్మాణము చేయఁదగు

సామాన్యనిర్దిష్టములయందు విశేషనియమము

అనిర్దిష్టే ఘృతే క్షీరే విశేషా ద్గవ్య మిష్యతే,
తైలేషు తిలతైలం చ గోమూత్రం మూత్రకీర్తనే 117
క్షారేషు యావశూక స్స్యాల్లవణేషు చ సైంధవమ్,

ఇతి ప్రథమాశ్వాసః

ఏయోగంబునందైనను నేయిగాని పాలుగాని సామాన్యముగాఁ జెప్పఁబడినప్పుడు ఆవునేతిని ఆవుపాలను గ్రహింపవలెను ఈతీరుననే తైలములందు నువ్వులనూనెను మూత్రములలో గోమూత్రమును క్షారములలో యవక్షారమును లవణము (ఉప్పు) లలో సైంధవలవణమును ఉపయోగింపవలయును

ఇది మొదటియాశ్వాసము

---

## ద్వితీయాశ్వాసః

మానప్రయోజనము

మాత్రా మపేక్షతే యస్మాత్కషాయాదిషు కల్పనా 118
తస్మాన్మాత్రావబోధార్థం వక్ష్యతే మానకల్పనా,

కషాయాది నిర్మాణము పరిమాణము ననుసరించి యుండుటచేత నాపరిమాణభేదము చెప్పఁబడును

జాలాంతరగతే భానౌ యత్సూక్ష్మం దృశ్యతే రజః 119
తస్య త్రింశత్తమోభాగః పరమాణుస్స ఉచ్యతే,
త్రసరేణుస్తు విజ్ఞేయస్త్రింశద్భిః పరమాణుభిః 120
త్రసరేణుస్తు పర్యాయనామ్నా వంశీ నిగద్యతే,

గవాక్షరంధ్రములనుండి ప్రసరించు సూర్యకిరణములమధ్యను చలించుచు సూక్ష్మంబగు రేణువులో ముప్పదియవపాలు పరమాణు వనఁబడును అట్టి పరమాణువులు ముప్పదియైనచో నొకత్రసరేణు వనంబరగు ఆత్రసరేణువు వంశియనిగూడ చెప్పఁబడును

చరకమతము

షడ్వంశ్యస్తు మరీచిస్స్యాత్ షణ్మరీచ్యస్తు సర్షప 121
అష్టౌ తే సర్షపా రక్తి స్తండుల శ్చాపి తద్ద్వయమ్,
ధాన్యమాషో భవేదేకో ధాన్యమాషద్వయం యవ 122
అండకాస్తే తు చత్వార స్తాశ్చతస్ర స్తు మాషక,
హేమ శ్చ ధాన్యక శ్చోక్తో భవేచ్ఛాణస్తు తే త్రయ 123

అణువంశు లొకమరీచియనియు, ఆఱుమరీచు లొకసర్షపంబనియు, ఎనిమిది సర్షపము లొకరక్తియనియు, తండులమనియుఁగూడ చెప్పఁబడును అరక్తికలురెండు ఒకధాన్యమాషమనియు, రెండు ధాన్యమాషము లొక యవమనియు, నాల్గు యవము లొకయండకమనియు నాల్గు అండకము లొక మాషమనియు, హేమమనియు, ధాన్యమనియుఁ గూడఁ జెప్పఁబడును మూఁడుమాషము లొకశాణమని చెప్పఁబడును ఇంతవఱకు చరకునిమతము

శాణం పాణితలం ముష్టి కుడువ ప్రస్థ మాఢకమ్,
ద్రోణం వాహం చ క్రమశో విజానీయాచ్చతుర్గుణమ్ 124

శాణము మొదలీచెప్పఁబడిన వన్నియు నొకదానికంటె నొకటి నాల్గింతలు ప్రమాణముగలవనియెఱుంగునది అనఁగా నాల్గుశాణములొక పాణితలమనియు, నాల్గుపాణితలము లొకముష్టియనియు, నాల్గుముష్టు లొకకుడవమనియు, నాల్గుకుడవము లొకప్రస్థమనియు, నాల్గుప్రస్థము లొకయాఢకమనియు నాల్గుఆఢకము లొకద్రోణమనియు నాల్గుద్రోణము లొకవాహమనియుఁ జెప్పఁబడును

ద్వౌ శాణౌ వటకం కోలం బదరం ద్రృక్ష్మ మేవ చ,

రెండు శాణములు లొకవటకమనంబడు మఱియు నీవటకము కోల మనియు బదరమనియు, ద్రృక్ష్మమనియు గూడ వ్యవహారింపఁబడును

అక్షః పిచు పాణితలం సువర్ణం కబలగ్రహా 125

కర్షం బిడాలపదకం తిందుకం పాణిమానికమ్,

అక్షము పిచువు, పాణితలము, సువర్ణము, కబలగ్రహాము కర్షము, బిడాలపదకము తిందుకము పాణిమానకము ఇవి యక్షమునకుఁ బర్యాయంబులు

ద్వే సువర్ణే పలార్ధం స్యా చ్ఛుక్తి రష్టమికా తథా 126

రెండుసువర్ణములు లరపల మని చెప్ప బడును మఱియు నిది శుక్తియని యు నష్టమికయనియు వ్యవహారింపఁబడును

పలం ప్రకుంచో బిల్వం చ ముష్టి రామ్రం చతుర్థకమ్,

పలము, ప్రకుంచము, బిల్వము ముష్టి, ఆమ్రము, చతుర్థకము ఇది పలమునకుఁ బర్యాయంబులు

పలస్య దశమో భాగ ప్రోచ్యతే ధరణం బుధై 127

పలములోఁ బదియవభాగము ధరణమని చెప్పఁబడును

మాషాణాం వింశతి ర్యద్వా నిష్కం గుంజాష్టకంతథా,

ఇరువది మాషంబు లైనను ఎనిమిది గురిగింజ లైనను ఒకనిష్కమని వ్యవహారింపఁబడును

తదేవ ద్విగుణం ప్రస్థం స షోడశపలం స్మృతమ్ 128

రెండునిష్కములుగాని, పదియాఱుపలములుగాని యొక ప్రస్థ మనం బడును

## చరకమతము

ఈవిషయము చరకోక్తమాగధమానంబున నిట్లు వివరింపఁబడియె,—

ద్వే సువర్ణే పలార్థం స్యాచ్ఛుక్తి రష్టమికా తథా,
ద్వేపలార్థే పలం ముష్టి ప్రకుంచోఽథ చతుర్థికా 129
బిల్వం షోడశికా చామ్రం ద్వేపలే ప్రసృతిం విదుః,
అష్టమానం తు విజ్ఞేయం కుడవౌ ద్వౌ తు మానికా 130
పలం చతుర్గుణం విద్యా దంజలిం కుడవం తథా,

అనఁగా రెండుసువర్ణము ఒరపలమనియు శుక్తియనియు అష్టమిక యనియు, రెండరపలము లోకపలమనియు, ముష్టియనియు ప్రకుంచమనియు, చతుర్థికమనియు,బిల్వమనియు షోడశికమనియు ఆమ్రమనియు జెప్ప బడును రెండుపలము లోక ప్రసృతియనియు అష్టమానమనియు జెప్పఁబడును నాలుగుపలము లోకకుడవమనియు అంజలియనియు, రెండుకుడవము లోక మానికయనియు , జెప్పఁబడును "చత్వారః కుడవాః ప్రస్థమ్" నాలుగుకుడవము లోక ప్రస్థమని చెప్పఁబడును కాన పదియారుపలము లోక ప్రస్థమని వ్యవహరింపఁబడును ఇది చరకమతము ననుసరించునది

ఆఢకం భాజనం కంసపాత్రం పాద్యముఖం శుభమ్,
భాండం సముద్రం కదళం తద్ద్వయంతు శివం స్మృతమ్ 131

నాలుగుప్రస్థము లోక యాఢకమని పూర్వము చెప్పఁబడెను అట్టి యాఢకము, భాజనము, కంసపాత్రము పాద్యముఖము, శుభము, భాండము, సముద్రము, కదళము అని పర్యాయనామంబుల వ్యవహరింపఁ బడును అట్టియాఢకములు రెండును శివమని చెప్పఁబడును అనగా అఱువది నాలుగుపలము లోకయాఢకమనియు, నూటయిరువదియెనిమిది పలము లోక శివమనియు చెప్పఁబడును

ద్రోణం శివద్వయం కుంభమున్మానో నల్వణో ఘటః,
అర్మణ కలశశ్చక్రశ్చతుర్గాఢక మి త్యపి 132

రెండు శివము లొక ద్రోణమని చెప్పఁబడును అట్టిద్రోణము కుంభము, ఉన్మానము, నల్వణము, ఘటము, అర్మణము, కలశము చక్రము చతురాఢకము అను పర్యాయంబులఁ జెప్పఁబడును అనగా రెండువందలయేబదియాఱు పలము లొక ద్రోణమని భావము

తౌ ద్వౌ తు ఖారి శ్శూర్పశ్చ తౌ మూషాగోణికా వహా,
తులా పలశతం తాసాం వింశతి ర్భార ఉచ్యతే 133

రెండుద్రోణము లొక ఖారియనియు శూర్పమనియుఁ జెప్పఁబడును. రెండు ఖారు లొకమూషయనిగాని, గోణియనిగాని, వహాయనిగాని, వ్యవహరింపఁబడును ఎనుటపండ్రెండుపలము లొకఖారియనియు వేయిన్నిరువది నాలుగుపలము లొకగోణియనియు భావము మఱియు నూఱుపలము లొక తులమనియు రెండువేలపలము లొకభారమనియుఁ జెప్పఁబడును ఇచ్చట చెప్పఁబడినమానక్రమ మీక్రింద వివరింపఁబడును

ముప్పది పరమాణువు లొకవంశి, ఆఱువంశు లొకమరీచి, ఆఱు మరీచు లొకసర్షపము ఎనిమిది సర్షపము లొకరక్తి రెండు రక్తు లొకధాన్యమాషము రెండు ధాన్యమాషము లొకయవము, నాలుగుయవము లొకయాఢకము నాలుగాఢకము లొకమాషకము మూఁడుమాషకము లొకశాణము, రెండుశాణము లొకవటకము, నాలుగువటకము లొకకర్షము, నాలుగుకర్షము లొకపలము, పదియాఱుపలము లొకప్రస్థము, రెండుప్రస్థము లొకశివము, రెండుశివము లొకద్రోణము, రెండుద్రోణము లొకఖారి, రెండుఖారు లొకగోణి.

ప్రస్థక్రమాత్పునః కేచిద్భారం ఖారీత్రయం విదు,

ఈచెప్పఁబడిన మానప్రకారము ఏనూటపండ్రెండు పలము లొక ఖారియు రెండువేల పలము లొకభారము నయియున్నవి కాని కొందఱా చార్యులు వారిప్రస్థభేదంబువలన మూఁడు ఖారు లొకభార మనిచెప్పిరి.

అనఁగా వారిమతము ననుసరించి వేయుం నేనూటముప్పదియారుపలము లొక భారమని చెప్పఁబడును

## మతాంతరము

జాలాంతరం గతే భానౌ యత్సూక్ష్మం దృశ్యతే కణ 134
పరమాణుస్తు సూక్ష్మత్వాత్ భావగ్రాహ్యో న చక్షుషా,
తేత్వష్టౌ త్రసరేణుస్స్యాత్ రథరేణుస్తదష్టకమ్ 135
తదష్టకం తు తూలాగ్రం భవేల్లిక్షా తదష్టకమ్,
అష్టౌ మధూళికాబీజం తా,స్తిలంస్యాత్తదష్టకమ్ 136
తిలద్వయం కాకిణి స్స్యాద్వ్రీహి స్తాసాం చతుష్టయమ్,
తద్ద్వయం విదళం తే ద్వే గుంజా తద్ద్వితయం పున 137
మంజిష్ఠా పంచ తా పాదం శాణం పాదత్రయం భవేత్,
శతషష్టిప్రమాణం తు వ్రీహీణాం నిష్క ముచ్యతే 138
అష్టనిష్కం పలం ప్రోక్తం తేషాం శతమితాతులా,
ఇతి కేచి త్ప్రశంసంతి శేష మత్రాపి పూర్వవత్ 139

పరమాణువు కంటికి గోచరంబుగాకుండుటంజేసి గవాక్షరంధ్రంబుల నుండి ప్రసరించు సూర్యకిరణంబులనడుమఁ గాన్పించు సూక్ష్మరేణువునుండి మానము ప్రారంభింపవలయును ఆసూక్ష్మరేణు వెనిమిది పరమాణువులు కలసి యేర్పడియున్నది ఇది త్రసరేణు వనంబరఁగు ఇట్టిత్రసరేణువు లెనిమిది కలియఁగా రథరేణువనంబడును ఎనిమిది రథరేణువులు తులాగ్రమనియు, ఎనిమిది తూలాగ్రములు ఒక లిక్షయనియు, ఎనిమిది లిక్షలొక మధూళికా బీజమనియు ఎనిమిది మధూళికాబీజము లొక తిలయనియు రెండుతిలలొక కాకణియనియు, నాలుగు కాకణులొక వ్రీహియనియు, రెండువ్రీహులొక విదళమనియు, రెండు విదళములు గుంజయనియు, రెండుగుంజ లొకమంజిష్ఠ

# పీఠిక

భేషజకల్పమను నీగ్రంథము నిదివఱలో శ్రీ వావిళ్ల వారు తెలుగుతాత్పర్యముతోఁ బ్రకటించియుండిరి వారు నాకీగ్రంథమును పంపెసరిచూచి పునర్ముద్రణమునకు సిద్ధముచేయవలెనని కోరిరి అటులనే మూలమునందలి స్ఖాలిత్యములను తాత్పర్యమందలి పొరబాట్లను ఆంధ్ర భేషజకల్పము దాని టీకను సహాయముజేసికొని సవరించితిని

మఱియు నీగ్రంథ మెప్పు డెవ్వరిచేతఁ జేయఁబడినదియు గ్రంథభాగమునుబట్టి తెలియ శక్యముకాదు కాని యాంధ్ర భేషజకల్పముయొక్క పీఠికయందు "సంస్కృత భేషజకల్పము" అనుశీర్షిక క్రింద "ఈగ్రంథమును ప్రచురించు నప్పటికి దానిని సరిచూచుకొనుటకు పీఠికయొక్క పదియవ పేజీయందు గనబరచిన ప్రకారము మా చే పది భేషజకల్పప్రతులు సంపాదింపబడినవి వానినిబట్టిచూచిన యో నాగ్రంథము భరద్వాజమతానుసారంబుగ శ్రీచందనాచార్యాత్మజుండగు గంగాధరాచార్యునిచేఁ గూర్పబడిన యొక యాయుర్వేదసంహితా గ్రంథమునందలి కల్పస్థానములోని కొన్నిభాగములని తెలియ దగియున్నది" అని వ్రాయబడియున్నది

దీనివలన నీ భేషజకల్పమునకుఁ గర్త శ్రీచందనాచార్య పుత్రుఁడగు గంగాధరాచార్యుఁడని తెలియుచున్నది ఈతని కాలమునుగూర్చిమాత్రము ఎవరును వ్రాసియుండలేదు చంకన

దాసుఁడను నొకవైద్యనిబంధనకర్తయున్నట్లు కొన్ని అర్వాచీన గ్రంథములలో గనబడుచున్నది ఆతఁడే యీచందనాచార్యుఁడయినచో వైద్యచింతామణి మొదలగు గ్రంథకర్తలకంటె నర్వాచీనుడే యీగ్రంథకర్త కానోపును

ఆయుర్వేదసంహితాగ్రంథములను కొంత తరచి యీ పరిభాషాగ్రంథమును గ్రంథకర్త సమకూర్చియుండును కావున నా యీఋుషులమతములు నచ్చటచ్చట విపులముగా వ్రాసియున్నాఁడు ఈగ్రంథము ప్రకరణవిభాగములేకనే యొకే ప్రకరణముగా నుండినది కాని ఆంధ్రభేషజకల్పము ననుసరించి అందు నాలుగాశ్వాసములుగా విభాగించియుండుటచే నిందు గూడ నట్లే విభాగమునుజూపితిని

ఇదివరలో శ్రీవావిళ్లవారు శుశ్రుతము శారీరస్థానమును మాత్రము తెనుగుతాత్పర్యముతో ప్రచురించి యున్నారు. త్వరలో సంపూర్ణగ్రంథమును తెనుగు తాత్పర్యముతో ప్రచురించి యశేషాంధ్రప్రజల కందించ గలరు

ఇట్లు

శ్రీరామతీర్థము
18–10–49

ఆయుర్వేదస్థాపక, ఆయుర్వేదమహోపాధ్యాయ
వైద్యవిద్యానిధి, పండిత
తి ప రామానుజస్వామి

శ్రీ గణాధిపతయే నమః

# భేషజకల్పము

## సాంధ్రతాత్పర్యము



## ప్రథమాశ్వాస

అథాతో భేషజకల్పం వ్యాఖ్యాస్యామః,
ఇతిహస్మాహ భగవాన్ భారద్వాజః 1

తా॥ మంగళాచరణానంతరంబున భేషజకల్పంబను గ్రంథమును వక్కాణించెదమని షడ్గుణైశ్వర్యసంపన్నుండగు భరద్వాజమహర్షి చెప్పఁబోవు ప్రకారము నుడువుచున్నాఁడు —

### అధ్యాయారంభ సంబంధము

శ్లో॥ సిద్ధౌషధానాం కేషాంచిత్పృథక్కల్పప్రసంగతః,
అథ భేషజకల్పోఽయం సామాన్యేన ప్రశస్యతే 2

ఆమ్నాయౌషధనిర్మాణకల్పంబు లీగ్రంథంబునఁ జెప్పఁబడునుగావ నీగ్రంథము భేషజకల్పం బను సంజ్ఞను బొందుచున్నది

### కల్పన ప్రశంస

దేశకాలానుగుణ్యేన సంగ్రహేణ యథావిధి,
స్థాపితం భేషజం యత్తత్కల్పనైరమృతాయతే 3

దేశంబునకును, కాలంబునకును, అనుగుణంబగునట్లును శాస్త్రోక్తప్రకారంబుగను సంగ్రహించుటచేత సిద్ధముచేసిన యౌషధ మాయాప్రయోగముల నమృతతుల్యంబై యుండును

## దేశభేదము

దేశో జాంగల అనూప స్సాధారణ ఇతి త్రిధా,

జాంగలము, అనూపము సాధారణము, అని దేశము మూఁడువిధంబులై యుండును

## జాంగలదేశము

జాంగలో విరళాత్యల్పకంటకద్రుమకాంకిత 4
అల్పప్రస్రవణో దూరవిగాఢవిరసోదక ,
వ్యోమవిస్తీర్ణవిషమవిరూక్షసికతస్థల 5
కృశస్థిరక్లేశసహవాతభూయిష్ఠమానుష ,
అరోగబహుళో యోని కటుకస్య రసస్య చ 6

అందు జాంగలదేశము విరళంబులై యల్పంబులగు ముండ్లచెట్లుగల దియు నల్పంబులగు సెలయేళ్లు గలదియు సెంతలోతున త్రవ్వినను నుప్పు నీరు గలదియు విస్తీర్ణమగు నాకాశము గలదియు నతిరూక్షంబులైన యిసుక తిన్నెలు గలదియునై యుండును మరియు నచ్చట వసించుమనుష్యులు చిక్కిన దేహంబులు కలవారై పనులచే నలియనివారై , వాతప్రకృతిగలవారై యుం దురు ఆదేశ మున విశేషముగా రోగములు పుట్టవు మరియు నచ్చట కటు రసము ప్రధానమై యుండును

## అనూపదేశము

అనూప శ్శిశిరస్నిగ్ధభూమిర్భూరితృణోపల ,
ప్రభూతశైవలచ్ఛన్నబహుమత్స్యజలాశయః 7
మహాద్రితుంగ స్తుంగద్రు స్తాళహింతాళవేష్టితః,
గళరోగాపచిగ్రంథిశ్లీపదాద్యాద్యుపద్రవ 8
సుకుమారమృదుస్థూలశ్లేష్మభూయిష్ఠమానుష ,
జాంగలాద్విపరీతశ్చ స యోనిర్మధురస్య చ 9

ఆనూపదేశము చల్లదనము గలిగి మెఱయుచున్న భూమి గలదియు, విస్తారంబుగా గడ్డి బాల్లు గలదియు, నాచుచే నావరింపఁబడి యనేకమత్స్యంబులచే వ్యాప్తములైన చెఱువులు గలదియు, ఉన్నతంబులగు పర్వతంబులుగలదియు పొడవుగల వృక్షంబులు గలదియు, తాఁటిచెట్లు, వాంతాళ (ఈత) వృక్షంబులు, విశేషముగఁ గలదియునై యుండును మఱియు నీదేశమునఁ గంఠరోగములు (గండమాలలు,) అపచీవ్రణములు కంతులు బోదకాలు మొదలగురోగంబులు విశేషముగా పుట్టును ఇచ్చట వసించువారు పనిచేయలేనివారై శరీరస్థౌల్యము గలవారై శ్లేష్మప్రకృతులై యుందురు మఱియు నీదేశంబున జాంగలదేశంబునకుఁ జెప్పఁబడిన గుణంబులకు వ్యతిరిక్తంబులైన గుణంబులన్నియు నుండును ఈదేశము మధురరసప్రధానంబై యుండును

## సాధారణదేశము

సాధారణస్సమమలస్సహితోభయలక్షణః,
శీతోష్ణవర్షపవనైస్సమం సాధార్యతే యత 10

సాధారణదేశము సమానంబులగు వాతపిత్తకఫదోషంబులు కలదియై, జాంగలానూపదేశంబుల గుణంబులచే మిశ్రితంబై, సమానంబులగు శీతము, ఉష్ణము, వర్షము, వాయువు కలదియై యుండును

## సాధారణదేశభేదము

జాంగలానూపబాహుళ్యాత్స తు సాధారణో ద్విధా,
కషాయతిక్తయోరాద్యే యోనిరన్యస్తదన్యయో

సాధారణదేశము జాంగలానూపదేశగుణంబు లధికంబుగా నుండుటఁజేసి జాంగలసాధారణదేశము ఆనూపసాధారణదేశము అని రెండువిధములుగా నుండును అందు మొదటిదానియందు కషాయము (ఒగరు) తిక్తరసము (చేదు) ప్రధానంబులుగా నుండును రెండవదానియం దుప్పుపులుపు ప్రధానమైయుండును

కాలముచే శీతోష్ణభేదము

తత్రాపి శిశిరే సౌమ్యం గ్రీష్మే త్వాగ్నేయమిష్యతే,

అట్టిదేశమందుకూడ శిశిరఋతువునందు శీతవీర్యౌషధులును, గ్రీష్మఋతువునం దుష్ణవీర్యౌషధులును గ్రహింపదగును

ఓషధీగ్రహణయోగ్యభూమి

తత్ర సాధారణే దేశే ధన్వే వా లక్షణాన్వితే 12
జ్యోత్స్నాతపానిలజలైర్యథాకాలం చ సేవితే,
ప్రదక్షిణోదకా మృద్వీ ప్రభూతకుశరోహిషా 13
స్నిగ్ధకృష్ణా సువర్ణాభా సురభిస్వాదుమృత్తికా,
శర్కరోషరపాషాణశ్వభ్రవల్మీకవర్జితా 14
చైత్యశ్మశానాయతనసభోద్యానవివర్జితా,
అపాతకృషణాక్రాంతా పాదపైర్బలవత్తరైః 15

ఓషధులుపుట్టుదేశము సాధారణదేశముగాని, జాంగలదేశముగాని యయి యుండవలెను అట్టిదేశము నాయాఋతుధర్మంబుల నొప్పారుచుండవలెను వెన్నెల యెండ, గాలి నీరు వీనిచే కాలానుసారంబుగ వ్యాప్తమై యుండవలెను అట్టిదేశమందలిభూమి ప్రదక్షిణముగాఁ బ్రవహించుచున్న యుదకంబులు గలదియు, విశేషముగా దర్భ మొదలగు కసవుచే వ్యాప్తంబై నదియు నయి యుండవలెను అచ్చటి మన్ను నల్లగాఁగాని, బంగారపు ఛాయగాఁ గాని యుండి పరిమళించుచు దీయగా నుండవలెను అచ్చట గండ్రయిసుక, చౌడు, గులకఱాల్లు గోతులు పుట్టలు, మొదలగునవి వ్యాపించి యుండఁ గూడదు మఱియు నచ్చటిభూమి రాజవీథి, శ్మశానము ఇండ్లు, రచ్చపట్టు, ఉద్యానవనము వీని కనుకూలమై యుండక నాగలిచే దున్నఁబడక యనేకంబులగు వృక్షంబులచే నావరింపఁబడి యుండవలెను

### వర్జ్యభూమి

జంతుజుష్టాం జలే మగ్నాం అవిదగ్ధాం చ వైకృతై,
భూతైశ్ఛాయాతపాంబ్వాద్యైర్యథాకాలం న సేవితామ్

పురుగులుగలదియు, సర్వకాలంబులయందు నీటిచే వ్యాప్తమైనదియుఁ బూర్వము చెప్పఁబడిన గుణము లేనిదియుఁ బిశాచంబు గలదియు, నాతపాదులచే నాయాకాలానుసారంబుగా నావృతంబుగానిదియునగు భూమి దుష్టమై పరఁగు అనఁగా నట్టిభూమియందు బుట్టినమూలికలు నిష్ప్రయోజనంబులై యుండును కాన వానిని గ్రహింపఁగూడదు *

### భూమిగుణాధిక భూమి

విశేషతస్థూలవృక్షా తృణసస్యోజ్జ్వలా స్థిరా,
గురు రశ్మవతీ శ్యామా కృష్ణా వా స్వగుణాధికా 17

విస్తారముగా స్థూలవృక్షములుగలగియుఁ గసవు పైరు మొదలగు వానిచే వ్యాప్తంబైనదియు గట్టిగానుండి బరువుగలిగి యనేకపాషాణంబులచే నిండియుండి శ్యామలవర్ణముగాని నల్లనివర్ణముగాని గలిగియుండుభూమి భూమిగుణాధికభూమి ' యని చెప్పంబడును

### అంబుగుణాధికభూమి

శీతలా కోమలా స్నిగ్ధా ద్రుమసస్యతృణోజ్జ్వలా,
ఆసన్నసలిలా పాండుస్నిగ్ధా చాంబుగుణాధికా 18

చల్లనై కోమలంబై వృక్షంబులచేతను బైరులచేతను దృణముల చేతను నావృతంబై కొలది లోతునసే నీటిపారుదల కలదియై తెల్లగా మెఱయుచున్నభూమి అంబుగుణాధికభూమి యని చెప్పఁబడును

---

* ఈశ్లోకము కొంచెము మార్పుతో వర్జ్యౌషధిని జెప్పునప్పుడున్నది. ఇది యిచ్చట లేనట్లు ఆంధ్రభైషజ్య రత్నావళివలన దెలియుచున్నది

## వహ్నిగుణాధికభూమి

అల్పపుష్పప్రవిరళాఽఽపాండువృక్షప్రరోహిణీ,
లఘురూక్షవతీ నానావర్ణా వహ్నిగుణాధికా 19

అల్పపుష్పములు గలిగి విరళంబులైన తెల్లనివృక్షములు తీఁగలు కలదియుం, చులకనై రూక్షముగా నున్నభూమి వహ్నిగుణాధికభూమి అని చెప్పఁబడును

## వాయుగుణాధికభూమి

తనుకోటరవృక్షాల్పరససస్యప్రరోహిణీ,
రూక్షా రాసభభస్మాభవర్ణా వాయుగుణాధికా 20

సూక్ష్మరంధ్రములుగల వృక్షములుగలిగి యల్పంబుగా మధురాది రసములు, పైరులు తీఁగలు గలిగి రూక్షంబై గాడిదవర్ణముగాని బూడిదవర్ణముగాని కలిగియున్నభూమి వాయుగుణాధికభూమి ' యని చెప్పఁబడును

## వ్యోమగుణాధికభూమి

సమా శ్వభ్రవతీ శ్యామా మృద్వవ్యక్తరసోదకా,
సర్జసాలమహావృక్షా ప్రాయో వ్యోమగుణాధికా 21

కొన్నిస్థలముల సమానంబై కొన్నిస్థముల గుంటలుకలిగి శ్యామవర్ణమై మెత్తనై చవియేర్పరుపరాని యుదకంబుకలిగి, గుగ్గిలపువృక్షంబుఁ చేతను ఏఁమ్రకులు మొదలగు మహావృక్షంబులచేతను వ్యాప్తంబైయున్న భూమి "వ్యోమగుణాధికభూమి ' యని చెప్పఁబడును

## ఓషధీద్వైవిధ్యము

తదేతద్ద్వి గుణం ప్రోక్తం బృంహణం లంఘనం క్రమాత్,

పూర్వము చెప్పఁబడిన భూమియం దుద్భవించినయోషధీజాతము బృంహణ మనియు లంఘన మనియుం రెండువిధంబులం బరఁగు

### రేచనౌషధము

తత్ర క్ష్మాంబుగుణోద్రిక్తభూమిజాతం విరేచనమ్ 22

పృథివి, యుదకము- వీనిగుణములు విశేషంబుగా గల భూమియందుఁ బుట్టినయోషధులు విరేచనకారిణు లగును

### వమనౌషధము

ఆకాశగుణభూయిష్టభూమిజం వమనం స్మృతమ్,

ఆకాశగుణము విశేషముగాఁ గలిగియున్న భూమియందుఁ బుట్టిన యోషధి వమనకారిణి యగును

### వమనరేచనౌషధము

సర్వభూతగుణోత్కృష్టభూమిజం తూభయాత్మకమ్ 23

పంచమహాభూతములయొక్క గుణంబులు విశేషముగాఁ గలిగియున్న భూమియందుఁ బుట్టనయోషధులు వమనకారిణులు, విరేచనకారిణులు గూడ నగును

### భూతగుణంబులచే గుణసామ్యము

యద్యద్భూతగుణోత్కృష్టభూమిజం యద్యదౌషధమ్,
తత్తద్ధత్తే గుణా స్తద్వదధిష్ఠానానుబంధత 24

ఏయోషధి యేమహాభూతముయొక్క గుణంబులు విశేషముగాఁ గలిగియున్న ప్రదేశంబునం బుట్టుచున్నదో అట్టిమహాభూముయొక్క గుణమునే కలిగియుండును

### ఓషధీగ్రహణపూర్వదివసక్రమము

అథ కల్యాణచరితశ్శ్రీమాన్ శుచిరుపోషిత,
సంపూజ్య దేవగోవిప్రాన్ బ్రహ్మాణం దక్షమశ్వినౌ 25
చతుర్దిక్షు బలిం దత్వా గంధపుష్పాక్షతాదిభిః,

దేవతాభ్యస్సురుస్తాభ్యో నివసంతి యమాశ్రితా 26
క్షుంతుమర్హాంతు గచ్ఛంతు త్యక్త్వైనం వాసమవ్యయమ్,
భేషజార్థం గ్రహీష్యామి సర్వప్రాణభృతామిమామ్ 27
వృక్షం న లోభాన్న క్రోధాద్బ్రాహ్మణార్థే విశేషత,
మంత్రేణానేన విధివద్రక్షాబంధం సమాచరేత్ 28
సూత్రై స్తత్తత్క్రియాయోగ్యవర్ణక్షౌమాదిభిర్నవై,

ఓషధులను గ్రహింపఁదలచిన పూతచరితుఁడగు వైద్యుఁడు పూర్వపు రోజున నుపవాసముండి శ్రీమంతుఁడై పవిత్రుఁడుగానుండి, దేవతలను, గోవులను బ్రాహ్మణులను బ్రహ్మను, దక్షప్రజాపతిని అశ్వినీదేవతలను, యథావిధిగా బూజయొనర్చి నాల్గుదిశలయందు బలివెట్టి యాయోషధి నాశ్రయించియుండు సమస్తదేవతలనుగూర్చి యోదేవతలారా! నన్ను నిరపరాధుని జేసి మీరాశ్రయించియుండు నీయోషధిని విడిచిపొండు! సర్వప్రాణికోటికి నౌషధార్థంబై నే నీ యోషధిని గ్రహించెదను మఱియు నోదేవతలారా! నే నీయోషధిని లోభంబుచే గ్రహించుటలేదు ప్రధానంబుగా బ్రాహ్మణరక్షణార్థమే అను నర్థముగల మంత్రంబుచే బ్రార్థించి, పిమ్మట నానావర్ణంబులుగల పట్టుసూత్రంబుల నాయోషధికి రక్షాబంధము చేయవలయును పిమ్మట నారోజునఁ దనగృహంబునకుఁ బోవలెను

## ఓషధీగ్రహణదివసక్రమము

అపరేద్యుర్న చేత్కించి త్తత్ర వైకృత మద్భుతమ్ 29
యుగమాత్రోద్గతే సూర్యే విధేయం స్వస్తివాచనమ్,
పూర్వాగ్ర ముత్తరాగ్రం వా పాతయే దథచోత్తరేత్ 30

మఱునాఁడు తాను కట్టిన రక్షాబంధము పూర్వమువలెనే యుండి యక్కడ మఱి యేవికారము లేకుండుటను చూచి బ్రాహ్మణులచే స్వస్తివాచనములను జేయించుకొనుచు నక్కడకు వచ్చి సూర్యుఁ డుదయించి కాఁడియెత్తునకు

రాఁగాఁ జెప్పఁబోవు ఖననమంత్ర ప్రకార మాయోషధియొక్క తూర్పుగాఁ బాఱిన వేరునైనను లేక యుత్తరపువేరునైనను త్రవ్వవలెను

ఖననమంత్రము

యేన త్వాం ఖనతే బ్రహ్మా యేన త్వాం ఖనతే హరి,
తేనాహంత్వాం ఖనిష్యామి పంచశాఖేన పాణినా 31

బ్రహ్మ విష్ణువు నిన్నేహస్తముచే త్రవ్విదరో ఆట్టి అయిదు వ్రేళ్లుగల చేతితో నిన్ను త్రవ్వెదను ' ఇదియే ఖననమంత్రము దీనిచేతనే పూర్వోక్తప్రకారము త్రవ్వవలయును

గ్రహణమంత్రము

ఓ న్నమ స్స్వ స్త్యోషధీభ్య ఊర్జవత్యో భవిష్యథ,
ఏకైకస్మిఁ మహద్వీర్యం కురుధ్వం ప్రార్థయామి వ 32

మంగళమగుగాక, ఓషధులగు మీకు నమస్కారము మీకు శుభము ఓషధులారా! బలవంతము లగుదురుగాక ఒక్కొక్కనియందెక్కుడు వీర్యము గలుగజేయుఁడు—మిమ్ము నర్థించెదను ఈమంత్రము జెప్పి యాయోషధిం జేతితోఁ బట్టుకొనవలయును

ఓషధీభక్షణమంత్రము

ఓమ్ ఔషధేశ్వరి! పచపచ, దహదహ, హన హన,
దారయ దారయ విఘ్నాం స్తుభ్యం నమః 33

ఓషధీశ్రేష్ఠమా! మంగళము * విఘ్నములను మిక్కిలి దహించుము మిక్కిలి నశింపజేయుము మిక్కిలి చీల్చుము నీకు నమస్కారము " ఈమంత్రమునుజెప్పి యోషధిని లోనికిఁ బుచ్చుకొనవలయును

"అత్రైవ నిత్యం కల్యాణి! మమ కార్యం కరిష్యసి,
మమ కార్యం కృతా దేవి! పశ్చాత్స్వర్గం గమిష్యసి" 34

---

* విఘ్నీభూతాయదారోగాః ఇత్యాది చరకవచనమువలన రోగములే విఘ్నములని యెరుఁగవలెను

ఇత్యనేనైవ మంత్రేణ గృహ్ణీయాదౌషధం సుధీ,
ఉదఙ్ముఖః ప్రాఙ్ముఖో వా యుక్తం వర్ణరసాదిభి 35

ఓ ఔషధీశ్వరి! నీవు నాకార్యం బిచ్చుటనే జేసి పిమ్మట స్వర్గమున కు బోమ్ము అనుమాత్రమును బఠించుచు దూర్పుదిక్కునకుఁగాని ఉత్తరపు దిశకుఁగాని యభిముఖుండై వర్ణరసయుక్తమైన యౌషధము భక్షింపవలయును

## పర్జ్యమూలికలు

జంతుజుష్టం జలే మగ్నం అవిదగ్ధం చ వైకృతమ్,
భూత్యై శ్చాయాతపాంబ్వాద్యైర్యథాకాలం న సేవితం 36
అవబంధనమార్గస్థం విజ్ఞాతం వీర్యవర్జితమ్,
రాత్రౌ చ మూలికా గ్రాహ్యా రాహోరన్యత్రదర్శనాత్ 37

పురుగుపట్టినది నీటిలోమునిఁగినది, మేఁకయుతినినది, పిశాచములచే వికారమును బొందినది యెల్లపుడు నీడనేయున్నది యెల్లపుడు నెండనే యున్నది నీటిచే తడియక నెండినది చెట్లసందులనున్నది దారిలోనున్నది, పదుగురకుఁ దెలిసినది, సారములేనిది గాని చంద్రగ్రహణముఁదప్ప మఱియొకరాత్రులందుగాని మూలికను గ్రహింప గూడదు

## ఋతువిశేషంబుల మూలికాగ్రహణము

శాఖా పత్రం నవం తత్ర గ్రాహ్యం వర్ష వసంతయో,

వర్షర్తువునఁ గొమ్మలను, వసంతర్తువునం జిగురుటాకులను గ్రహింపవలెను

శీర్ణప్రరూఢపర్ణాని మూలం శిశిరఘర్మయో 38

శిశిరర్తువునందును, గ్రీష్మర్తువునందును, ఎండుటాకులను, మొలకలెత్తు ఆకులను, మూలములను గ్రహింపవలయును

యనియుం, ఐదుమంజిష్ఠ లొకపాదమనియుం, మూఁడుపాదము లొకశాణ మనియుం, నూటయిఱువది వ్రీహు లొకనిష్కమనియుం, నెనిమిదినిష్కము లొకపలమనియుం నూఱుపలము లొకతులయనియుఁ గొంద రాచార్యులు వక్కాణించిరి మిగిలిన ప్రమాణమంతయుం బూర్వపుదానివలెనే యెఱుంగునది

మతాంతరము

పంచాశత్త్రసరేణూనాం కాకిణీ త్యభిధీయతే,
వ్రీహిశ్చతస్ర కాకిణ్యో వ్రీహీణాం వింశతి పణమ్ 140
పణాని దశ నిష్కం స్యాత్త్రై ద్వాదశదశాష్టభి,
కేచిత్పలం త్రిధా ప్రాహు శ్శ్రేష్ఠమధ్యావరం క్రమాత్
ప్రబలే మధ్యమే పుంసి దుర్బలే చ ప్రశస్యతే,

ఏబది త్రసరేణువు లొకకాకిణియనియుం, నాలుగుకాకిణు లొక వ్రీహియనియుం, ఇరువది వ్రీహు లొకపణమనియుం, పదిపణము లొకనిష్క మనియుం అట్టినిష్కములు పండ్రెండుగాని పదిగాని, ఎనిమిదిగాని యొకపల మని కొందఱు పలమును మూఁడువిధములుగా చెప్పిరి ఇందు మొదటిది (౧౨ నిష్కములు) ఉత్తమమనియుం, రెండవది (౧౦ నిష్కములు) మధ్యమమని యుం, మూఁడవది (౮ నిష్కములు) అధమమనియుం జెప్పఁబడుచు ఇందు మొదటి ప్రమాణమును బలవంతుఁడగువానికి రెండవప్రమాణము మధ్య బలముగలవానికి మూఁడవప్రమాణము దుర్బలునకు నీయవలయును

మతాంతరము

కాకిణీ రాజికా మాత్రా కాకిణీనాం చతుష్టయమ్ 142
వ్రీహిశ్చతుష్టయం తేషాం గుంజా గుంజచతుష్టయమ్,
పణం పణద్వయం గుంజాద్వితయం చాపి ధానకమ్ 143

ధానకానాం త్రయం శాణం నిష్కం స్యాత్తచ్చతుష్టయమ్,
అత్రాఽపి పూర్వవ ద్జ్ఞేయ మిత్యాచార్యాః ప్రచక్షతే 144

ఒకకాకిణియే రాజికయనియు గూడ వ్యవహరింపఁబడును నాలుగు కాకణు లొకవ్రీహియనియు నాలుగువ్రీహు లొకగుంజయనియు నాలుగు గుంజ లొకపణమనియు, రెండుపణములు, రెండుగుంజలును నొకధానకమనియు, మూఁడుధానకము లొకశాణమనియు నాలుగుశాణము లొకనిష్కమనియు వ్యవహరింపఁబడును ఇతరమగు పరిమాణమంతయుఁ బూర్వమువలెనే తెలియందగును

ద్విగుంజంమాషకం విద్యాన్నిష్కం స్యాన్మాషవింశతి
దశనిష్కం పలం ప్రోక్తం తేషాం శతమితాతులా 145
ద్రవ్యమాన మితి ప్రాహు రౌరభ్రాద్యా మహర్షయ,

రెండుగురివెందగింజ లొకమాషకమనియు, ఇరువదిమాషకము లొక నిష్కమనియు పదినిష్కము లొకపలమనియు, నూఱుపలము లొక తులయనియు ఔరభ్రాది తంత్రకారులు వక్కాణించుచున్నారు

మతాంతరము

జాలాంతరగతె భానో సూక్ష్మం య ద్దృశ్యతే రజ 146
పరమాణుస్తు సూక్ష్మత్వాద్భావగ్రాహ్యో న చక్షుషా,
తే త్వష్టౌ త్రసరేణుస్స్యా ద్రథరేణు స్తదష్టకమ్ 147
తదష్టకం తు తూలాగ్రం భవేల్లిక్షా స్తదష్టకమ్

పరమాణువు దృష్టిగోచరంబు కాకుంటచేత గవాక్షమార్గంబులం బ్రసరించు సూర్యకిరణంబులఁ గానంబడు నణువునుండియే పరిమాణము ప్రారంభింపవలయును అట్టి పరమాణువు లెనిమిది కలసిన నొకత్రసరేణువనంబడును ఎనిమిది త్రసరేణువు లొకరథరేణువనంబడును ఎనిమిదిరథరేణువులు తులాగ్రమనియు, ఎనిమిది తులాగ్రము లొకలిక్షయనియు వ్యవహరింపఁబడును

## దైర్ఘ్యమానము

అంగుళిస్స్యాద్యవాశ్చాష్టౌ పాదముక్తం షడంగుళమ్
ద్వివితస్తిరరత్ని స్స్యా ద్వితస్తి ర్ద్వాదశాంగుళమ్,
చతుర్వితస్తిః కిష్కు స్స్యా ద్ద్వౌ కిష్కూ ధనురుచ్యతే
ధనుస్సహస్రం క్రోశం స్యాద్గవ్యూతిర్ద్విగుణం చ తత్,
గవ్యూతయ శ్చతస్రస్తు యోజనం పరిభాషితమ్ 150
అష్టౌ ధనుస్సహస్రాణి యోజనం ప్రోచ్యతే బుధైః,

ఇక దైర్ఘ్యమానమున ఎనిమిదియవము లొకయంగుళమనియు ఆఱు అంగుళము లొక పాదమనియు వ్యవహరింపఁబడును పండ్రెండు అంగుళము లొకవితస్తియనియు రెండువితస్తు లొకయరత్నియనియు నాలుగువితస్తు లొకకిష్కువనియు, రెండు కిష్కు లొకధనుస్సనియు వేయుధనువు లొక క్రోశమనియు రెండుక్రోశము లొక గవ్యూతియనియు, నాల్గు గవ్యూతులు గాని ఎనిమిదివేలు ధనువులుగాని యొకయోజనమనియుఁ జెప్పఁబడును

## శాలిహోత్రమతమున దైర్ఘ్యమానము

తిర్యగ్యవాస్తు తాన్యష్టావూర్ధ్వంవా వ్రీహయస్త్రయ
ప్రమాణ మంగుళ స్యోక్తం ప్రాదేశో ద్వాదశాంగుళః,
ప్రాదేశద్విగుణోఽరత్ని స్తస్మా త్కిష్కు స్తతో ధను 152
ధనుస్సహస్రం క్రోశ స్తు చతుక్రోశం తు యోజనమ్,
ఇత్యేవ మంగుళాదీనాం మానం కేచన మన్యతే 153

ఎనిమిది (యవ) గింజల నడ్డముగాగాని మూఁడు (రాజనపు) వరిగింజల పొడవుగాఁగాని నిలువఁబెట్టిన నెంతపొడవుండునో యంతటిపొడవంగుళమనియుఁ, పండ్రెండంగుళము లొక ప్రాదేశమనియు రెండు ప్రాదేశము లొకయరత్నియనియు, రెండు అరత్ను లొకకిష్కువనియు, రెండుకిష్కు

లోకధనువనియుం వేయుం ధనువు లోకక్రోశమనియుం, నాల్గుక్రోశము లోక యోజనమనియుం గొంద ఱాయుర్వేదతంత్రకారులు నుడువుచున్నారు

## మతాంతరమానాంగుళపరిమాణము

నరస్య మధ్యమం పర్వ మధ్యమాంగులిసంభవమ్,
మానాంగుళ మితి ఖ్యాతం ద్వితీయం పర్వ మధ్యమమ్

మనుజునిహస్తమందలి నడిమివ్రేలియొక్క రెండవకనుపు ఎంతపరిమితి గలిగియుండునో ఆపరిమితి మానాంగుళము (కొలతకుపయోగించు నంగుళము) అని చెప్పఁబడును

## పరమాణ్వాదిదైర్ఘ్యమానప్రయోజనము

మానం తు పరమాణ్వాది యోజనాంతం య దీరితమ్,
త ద్దేశ ప్రవిభాగాదౌ వస్త్రనేత్రాదికే తథా 155

పరమాణువు మొదలు యోజనమువఱకుఁ జెప్పఁబడియుండు మానము భూమిని కొలుచుటకును వస్త్రనేత్రములు మొదలగునవి కొలుచుటకును నుపయోగించును

## వంశ్యాద్యున్మానప్రయోజనము

మానం వంశాదిఖారాంతం యత్పూర్వం బహుధోదితమ్,
తదేవ శక్యతే తత్తద్భేషజాదిప్రకల్పనే 156

ఇతి ద్వితీయాశ్వాసః

వంశి మొదలు ఖారమువఱకుఁ జెప్పఁబడిన మాన మాషధాదులను కల్పించునపు డుపయోగించును

ఇది రెండవయాశ్వాసము

## తృ తీ యా శ్వా సః

### ద్విగుణముగా వేయదగినవి

శుష్కద్రవ్యేష్విదం మాన మేవమాది ప్రకీర్తితమ్,
ద్విగుణం యోజయేదార్ద్రే కుడవాది తథా ద్రవే 157

పై జెప్పఁబడినమానములన్నియు శుష్కద్రవ్యములఁ జేర్చునపుడు సమముగానుండును ద్రవపదార్థములను, పచ్చిగనుండుపదార్థములను జేర్చునెడల కుడవము మొదలు ద్విగుణముగాఁ జేర్చుకొనందగు

### ద్రవలక్షణము

ద్రవం తు సలిలం క్షీరం ఘృతతైలాదికం స్మృతమ్,

నీరు పాలు, నేయి తైలము యివి మొదలగునవి ద్రవపదార్థములనఁబడును

### ద్రవద్రవ్యమున మతభేదము

సామం నిరామ మిత్యన్యే ద్రవం ద్వేధా ప్రచక్షతే 158
సామద్రవంతు పానీయం మూత్ర సౌవీరకాదికమ్,
నిరామం రసనిర్యూహక్షౌద్రస్నేహాదికం మతమ్ 159
సామద్రవే తు ద్వైగుణ్యం నిరామే న తు శస్యతే,

ద్రవము సామమనియు, నిరామమనియు రెండువిధములు అందు నీరు మూత్రము కలి మొదలగునవి సామద్రవములు రసము కషాయము, తేనె నూనె మొదలగునవి నిరామద్రవములు ఇనుమడిఁజేర్చునపుడు సామద్రవములనుమాత్రమే చేర్పవలయును నిరామద్రవముల కినుమడిఁ జేర్పందగదు

### అర్ద్రద్రవద్రవ్యద్విగుణపరిభాష

శుష్కద్రవ్యాశ్రయం మానం నిర్దిశ్య యదుదాహృతమ్.

ద్రవ్యేషు ద్విగుణం మాన మిహార్ద్రేషు ద్రవేషు చ,
తదేతత్సర్వ మారభ్య కుడదాది మిహోచ్యతే 161

పైఁజెప్పఁబడినమానమంతయు శుష్క(ఎండిన)ద్రవ్యములకుఁ జెందియున్నది కాని ద్రవ(పలుచని) ద్రవ్యములం జేర్చునపుడును, ఆర్ద్ర (పచ్చి) ద్రవ్యములను జేర్చునపుడును ద్విగుణంబు (ఇనుమడి) గాఁ జేర్పవలయును, ఇనుమడింపుకుడవమానము మొదలుకొనియే చేయవలెను

## అపవాదము

శుష్కాణాం చ ద్రవాణాం చ సమం తత్కుడవాదథ

ఎండినద్రవ్యములను ద్రవద్రవ్యములను జేర్చునెడల కుడవముకంటె దిగువను సమానముగనే చేర్చవలెను

తులాయా మపి నైవేష్టం ద్విగుణా మానకల్పనా,
తులాపలశతం చైవ తచ్ఛుష్కద్రవయోస్సమమ్ 162

నూఱుపలము లొకతులయని చెప్పఁబడెను అట్టి తులాప్రమాణము గలపదార్థము చేర్చునపుడు శుష్కములయందు నార్ద్రములయందు ద్రవములయందు సమంబుగనే చేర్చవలయును అనఁగా నార్ద్రద్రవద్రవ్యములయం దినుమడిఁ జేర్పఁదగదని యభిప్రాయము

## ఇందుకుదాహరణము

సహచర తులాయా శ్చ రసే తైలాఢకం పచేత్,
ఇత్యుక్తం శత మేవాఽత్ర పలానాం పరిగణ్యతే 163

చరకసంహితయందలి చికిత్సాస్థానంబున, నిరువదెనిమిదవయధ్యాయంబున వాతచికిత్సయందు 140 వ శ్లోకమునందు నూఱుపలములు గోరింటరసమున నాఢకప్రమాణంబుగల తైలమును పక్వముగావింప వలయునని చెప్పఁబడియె ఇచ్చట తులప్రమాణమునకు ద్రవద్రవ్యములందు ద్విగుణ-

ప్రయోగ ముండినచో నిన్నూఱుపలములు ప్రయోగింపవలసియుండును అట్టయిన విరుద్ధంబగును కాన తులకు ద్విగుణప్రయోగంబు కూడదు

—— పలమునకు ద్విగుణప్రయోగాభావమునందు చరకప్రమాణము ——

పలస్యాపి చ నైవేష్టా ద్విగుణా మానకల్పనా,
స్పష్టార్థ మేవ పఠిత మిదం కుష్ఠచికిత్సితే 164
సలిలాఽఢకేఽష్టభాగే శేషే పూతో రసో గ్రాహ్యః,
తే చ కషాయాష్టపలే చతుష్పలం సర్పిషశ్చ పక్తవ్యమ్
యావత్స్యా దష్టపలం శేషం పేయం తతః కోష్ణమ్,
అష్టభాగావశేషే స్యా త్పలానా మష్టకద్వయమ్ 166
పలస్య ద్విగుణే మానే క్రియామానో న యుజ్యతే,
చతుష్పలం చ పక్తవ్యం క్వాథే నో క్తఘృతస్య చ 167
పలస్య ద్విగుణే మానే త ద ప్యష్టపలం భవేత్,

పలమునకుఁగూడ ద్విగుణప్రయోగ మెచ్చటను దగదు అట్లు ప్రయోగముండినచో జరకసంహితయందుఁ జికిత్సాస్థానంబున నేడవయధ్యాయంబునఁ జెప్పఁబడిన తిక్తషట్పలక ఘృతకల్పనము విరుద్ధమగును ఈఘృతమునం దాఢకప్రమాణముగల జలమందుఁ జెప్పఁబడిన ద్రవ్యములను బోసి యెనిమిదవభాగము (8 పలములు) మిగులునట్లు కాచి యాకషాయంబున నెనిమిది పలములలో నాలుగుపలములు నేయిబోసి ఎనిమిది పలములు మిగులునట్లు కాచి యావేఁడిగా నున్నఘృతమును త్రాగవలయునని చెప్పఁబడుచున్నది ఇందు పలమునకు ద్విగుణప్రయోగముండిన నెనిమిది పలముల కషాయము పదునాఱుపలములు కావలసియుండును మఱియు నాలుగుపలముల నేయి యెనిమిదిపలములుగావలయును అయ్యవి పక్వముచేయఁగాఁ జెప్పిన ఎనిమి పలంబులు పదునాఱుపలంబులగును అట్లయిన విరుద్ధముగాన పలమునకు ద్విగుణ ప్రమాణము గూడదు

పలమునకు ద్విగుణ ప్రయోగమందు మఱియొక బాధకము

నిరూహామాననిర్దేశ ఏవం సతి చ బాధ్యతే 168
ప్రసృతార్థం సమారభ్య ద్వాదశ ప్రసృతా పరమ్,
ఏషా మాత్రా ద్విగుణితా ద్విగుణప్రసృతా భవేత్ 169
నిరూహమాత్రాశ్శాస్త్రోక్తాద్వాదశప్రసృతా స్తథా,
చత్వారింశత్పలాని స్యు రష్టాభి రధికాని చ 170

నిరూహవస్తిప్రమాణము ప్రసృతార్థము మొదలు పండ్రెండు ప్రసృతములని చెప్పంబడెను ఇందు ప్రసృతములు పండ్రెండును ద్విగుణముకాఁగా నిరువదినాలుగు ప్రసృతములు కావలసియుండును రెండుపలము లొక ప్రసృతి యని చెప్పఁబడెను గాన యాపలములు నలువదెనిమిది కావలసవచ్చును అది శాస్త్రవిరుద్ధంబగును గాన పలమునకు ద్విగుణప్రయోగము లేదు మఱియుం దీనిం బట్టి ప్రసృతంబునకుఁ గూడ ద్విగుణప్రయోగంబు గూడదు

పలమునకు ద్వైగుణ్యాభావమునందు ఖరనాదవచము

స్వరసాత్క్వథితాచ్ఛీతాత్కషాయాత్ షట్పలం భవేత్,
ఇత్యుక్తం ఖరనాదేన తద్ద్వాదశపలం భవేత్ 171

ఖరనాదుం డనుతంత్రకర్త స్వరమునుగాని కాచిన కషాయము గాని శీతకషాయముగాని యాఱుపలంబులు త్రాగవలెనని చెప్పియున్నాఁడు. పలమునకు ద్విగుణప్రయోగముండినఁ బండ్రెండుపలములగును కాన ద్వైగుణ్యము లేదు

మఱియొక బాధకము

పైత్యకే యుజ్యతే గుల్మే సర్పిషశ్చ చతుష్పలమ్,
పిబేత్త న్మూర్ఛితం తేన గుల్మశ్శామ్యతి పైత్యకః 172
చతుష్పలం ఘృతం త్వేవ మత్రాప్యష్టపలం భవేత్,

వైత్యగుల్మంబున మూర్ఛితంబగు నేయి నాలుగు పలములు చెప్పఁ బడియె పలమునకు ద్వైగుణ్యముండిన నయ్యది యెనిమిది పలములు గావలసి యుండును

అంజలికి ద్వైగుణ్యాభావము

అంజలేరపి నైవేషా ద్విగుణా మానకల్పనా 173
వ్యాఖ్యాదీనాం తత్ర తత్ర క్వాథస్యాంజలిరిష్యతే,
అత్ర సుశ్రుతనిర్దిష్టక్వాథోఽయం ద్విగుణో భవేత్ 174

అంజలిపరిమాణమునకుఁ గూడ ద్విగుణప్రయోగము లేదు ఉండినచో సుశ్రుతాచార్యుని చేఁ జెప్పంబడిన యంజలిప్రమాణము ద్విగుణము కావలసి యుండును అట్లయిన పానముచేయవలసిన కషాయమెనిమిది పలంబులగును కాన విరుద్ధమగును

మఱియొకప్రమాణము

స్వర్ణక్షీరాదికే యోగే మాత్రా హ్యంజలి రిష్యతే,
అంజలేర్ద్విగుణత్వే తు మాత్రాప్యష్టపలం భవేత్ 175

స్వర్ణక్షీరాదియోగంబున నంజలిప్రమాణము మాత్ర చెప్పంబడెను అంజలికి ద్విగుణప్రయోగముండినచో నెనిమిదిపలములు మాత్ర కావలసి యుండును కాన అంజలికి ద్విగుణప్రయోగము కుదదు

మఱియొకచరకబాధకము

గాల్మికే త్రాయమాణాద్యం ఘృతం తు పఠిపఠ్యతే,
రసస్యామలకానాం చ క్షీరస్య చ ఘృతస్యచ 176
పలాని పృథగష్టాష్టౌ దత్వా సమ్యగ్విపాచయేత్
అష్టౌ ప్రత్యేక మేతాని స్యు ష్షోడశపలాని తు 177
తస్మా దేవం ప్రకారేషు నిర్దిష్టేషు విరుధ్యతే,

చరకసంహితయందు చికిత్సాస్థానంబున నైదవయధ్యాయంబున గుల్మ చికిత్సయందు త్రాయమాణఘృతము చెప్పఁబడియున్నది అం దుసిరిక రసము, పాలు, నేయి, యివి వేఱువేఱుగా నెనిమిదిపలములు బోయవలయు నని చెప్ప బడియె అందు పల ప్రమాణమునకు ద్వైగుణ్య ముండిన నయ్యవి యొక్కొకటి పదునాఱుపలములు గావలఁయుండును కాన యీరీతిని పెక్కు యోగంబుల విరుద్ధమగును గాన పలపరిమాణమున కెచ్చటను ద్వైగుణ్యము కూడదు

ఫలితకథనము

ద్రవాణాం ద్విగుణం మానం తత్కార్యం కుదవాదిషు
ఆర్ద్రేష్వపి చ సర్వేషు ద్విగుణం మాన మిష్యతే,

అందువలన ద్రవద్రవ్యములకును, ఆర్ద్ర (పచ్చి) ద్రవ్యములకును, కుదవము మొదలు ద్విగుణముగాఁ బ్రయోగింపఁదగును

శుష్కప్రసిద్ధద్రవ్యేషు సదార్ద్రేషు ద్రవేషు చ 179
శుష్కాలాభప్రయోజ్యేషు ద్విగుణం మాన మిష్యతే

ఎల్లప్పుడు శుష్కముగానే ప్రయోగింపఁదగిన ద్రవ్యములు లభింపఁ నపుడు పచ్చిగనుండు ద్రవ్యములను ప్రయోగించు నెడల ద్విగుణముగా బ్రయోగింపఁదగును

ఆర్ద్రప్రసిద్ధ ద్రవ్యేషు యదా శుష్కం ప్రయుజ్యతే 180
ఆర్ద్రాలాభాత్క్రియాకాలే ద్విగుణం స్యా త్తదాపిన,

ఎల్లపుడును పచ్చిగనే యుపయోగింపందగు ద్రవ్యములు లభింపక యెండినవానిని ప్రయోగించునపుడు ద్విగుణముగాఁ బ్రయోగింపఁదగదు

శుష్కద్రవ్యేతు యామాత్రా చార్ద్రస్య ద్విగుణాహిసా
శుష్కస్య గురుతీక్ష్ణత్వా త్తస్మాదర్ధం ప్రకీర్తితమ్,

అను ప్రమాణము ప్రకారము శుష్కద్రవ్యమున కార్ద్రద్రవ్యమును ప్రయోగించునెడ రెట్టింతగాఁ బ్రయోగింపవలెను ఆర్ద్రద్రవ్యమునకు శుష్కద్రవ్యమును ప్రయోగించు నెడ శుష్కద్రవ్యము గురుత్వము కలిగియుండి తీక్ష్ణంబౌటచేత నార్ద్రద్రవ్యంబున సగముపాలు ప్రయోగింపఁదగును కాన పైవాక్యమునకు సగము ప్రయోగింపవలయునని తాత్పర్యము

వాశాఘృతే వృషఘృతే తైలే సహచరే తథా 182
ద్రవ్యాణాం ద్విగుణం మాన మేవ మాదిషు నేష్యతే,
ఆర్ద్రాణా మేవ తేషాం హి ప్రయోగ శ్శశ్యతే యత
శతావరిమూలతులా శ్చతస్రో యాః ప్రకీర్తితాః,
న తత్ర ద్విగుణం మానం భిషగ్భి ర్వైశ్చి దాహృతమ్

వాశాఘృతము, వృషఘృతము సహచరతైలము, వీనియందలి పచ్చిగనుండు ద్రవ్యములను ద్విగుణముగాఁ జేర్పఁగూడదు ఇందుఁ జెప్పఁబడిన యడ్డసరము ములుగోరింట, మొదలగునవి యెల్లపుడును పచ్చిగనే ప్రయోగింపవలయుననియు నెండినచోఁ బ్రయోజనరహితంబులనియుఁ బూర్వము చెప్పఁబడియెనుగాన వీనిని జెప్పినపరిమాణము చొప్పున బ్రయోగింపఁదగును పిల్లిపీ చరగడ్డలు నాలుగుతులలు వేయమనప్పుడే వైద్యవరులును ద్విగుణముగా వేయుటలేదు

## మాగధ లౌకిక ప్రస్థభేదము

మాగధం లౌకికం చేతి ద్వివిధం ప్రస్థ ముచ్యతే,
పలైః షోడశభిః ప్రస్థ మాద్యం ద్వాదశనిష్కకైః 185
అన్య త్పలై ర్ద్వాదశభి రష్టనిష్కాన్వితైః పలైః,

మాగధప్రస్థమనియు లౌకికప్రస్థమనియు, ప్రస్థము రెండువిధములం బరఁగు అందుఁ బండ్రెండునిష్కములపలము ప్రకారము పదునాఱుపలములు మాగధప్రస్థమనియు, ఎనిమిది నిష్కములపలము ప్రకారము పండ్రెండు పలములు లౌకిక ప్రస్థమనియుఁ జెప్పఁబడును

మాగధప్రస్థము

షడంగుళం తు విస్తీర్ణం ద్వాదశాంగుళ మాయతమ్ 186
ఏత త్తు మాగధప్రస్థం మానభాండేషు పూజితమ్,

ఆఱంగుళముల వెడల్పును, (పొడవు వారము) పండ్రెండంగుళముల నిడువియుం గలది మాగధప్రస్థ మనంబడును ఇయ్యదికొలతయం దుపయోగించును

దాక్షిణాత్యమత లౌకికప్రస్థము

షడ్భిర్ద్వినిష్కాఽభ్యధికై రష్టనిష్కాన్వితై పలై 187
కనీయాన్ లౌకిక ప్రస్థో దాక్షిణాత్యేషు శస్యతే,
తేషాం మతే శతపలం ద్రోణ మి త్యేవ నిశ్చితమ్ 188

ఎనిమిదినిష్కములు పలము చొప్పున నాఱుపలముల రెండునిష్కములు లౌకికప్రస్థమని దాక్షిణాత్యులు చెప్పుచున్నారు మఱియు వారిమతంబుచే నూఱుపలంబు లౌకికద్రోణమగును

గజాశ్వాదిచికిత్సాప్రస్థము

లౌకికం షోడశపలం మాగధం ద్విగుణై పలై,
ఇతి ప్రాహు ర్ద్విధా ప్రస్థం గజాశ్వాదిచికిత్సితే 189

పదియాఱుపలము లౌకలౌకికప్రస్థమనియు, ముప్పదిరెండు పలము లౌకమాగధప్రస్థమనియు గజాశ్వాదిచికిత్సయందు గొందఱాచార్యులు వచించిరి

భోజమతంబున ప్రస్థభేదము

ద్వాత్రింశద్భి పలై ప్రస్థం భవేత్పాయసలాజయో
మూత్రకాంజికమ స్త్వంబునారికేళాంభసా మపి 190
మూలత్వక్సారపత్రాణాం పుష్పస్య చ ఫలస్య చ,
శిలాలవణమృల్లోష్టలోహానాం గోమయస్య చ 191

పలైష్షోడశభి ప్రస్థం రసస్యాఽప్యౌషధస్య చ,
ప్రస్థం పలానాం వింశత్యా తైలమాక్షికసర్పిషామ్ 192
త్రింశ క్షీరస్యచప్రస్థం దధ్నస్స్యా త్పంచ పంచభిః,
గుడస్య సప్తదశభి రితి భోజమతస్థితి 193

పాయసము లాజలు గోమూత్రము కలి పెరుఁగుమీఁది నీరు, టెంకాయనీరు, వీనికి ముప్పదిరెండుపలము లొకప్రస్థమనియు వేరు పట్ట, చేవ ఆకులు, పువ్వులు, ఫలములు రాళ్లు ఉప్పు మన్ను, పెంకులు లోహములు, గోమయము, స్వరసము ఎద్ధౌషధము, వీనికిఁబదునాఱుపలము లొకప్రస్థమనియు, నూనె తేనె నేయి వీని కిరువదిపలము లొకప్రస్థమనియు, క్షీరములకు ముప్పదిపలము లొకప్రస్థమనియు, పెరుఁగున కిరువదియైదుపలము లొకప్రస్థమనియు బెల్లమునకుఁ బదునేడుపలము లొకప్రస్థమనియు, భోజతంత్రంబునఁ జెప్పఁబడెను

### స్వరసలక్షణము

సద్యస్సముద్ధృతాత్క్షుణ్ణాద్యస్స్రవేద్వస్త్రపీడనాత్,
స్వరసస్స సముద్దిష్ట నిర్యాసో రస ఇ త్యపి 194

ఓషధిని అప్పుడే తీసుకొనివచ్చి ఱోటిలోవేసి దంచి గుడ్డలోవేసి పిడిచిన స్రవించురసమునకు స్వరసమనియు, నిర్యాసమనియు, రసమనియు పేరు.

### రసమురాని ద్రవ్యమందు రసముతీయుక్రమము

అగ్రాహ్యస్వరసం ద్రవ్యం క్షోదయిత్వా పచే జ్జలే,
చతుర్భాగావశేషం తు పూతం తు రసవ ద్భవేత్ 195

రసమురాని ద్రవ్యములను మెత్తగా నలియఁగొట్టి నాలుగింతలనీటిలోఁ బోసి నాలవభాగము మిగులునట్లుకాచి వడియఁబోసినచో నదియు స్వరసమని వ్యవహరింపఁబడును

### మతాంతరము

శుష్కం చూర్ణీకృతం ద్రవ్య మాఢకం సలిలాఢకే,

అహో రాత్రం స్థితం యద్వా పూతం స్వరసవద్భవేత్ 196

ఎండిన ద్రవ్యమును నలియఁగొట్టి యాధకపరిమాణముగల యా ద్రవ్యమును, ఆఢమానముగల నీటిలో నూరఁబెట్టి యొకరాత్రియు, నొకపగలును ఉంచి ఎమ్మట వడియఁగట్టినచో నదియును స్వరసమనఁబడును

కల్కలక్షణము

కల్క స్తూ౽లపిష్ట స్స్యా ద్ద్రవై ర్భక్షితో౽థవా,

పచ్చిగనుండు ద్రవ్యమునైనను ఎండియుండు ద్రవ్యమును నీటితోఁ గలిపియైనను ఖల్వముపై మెత్తగానూరిన ముద్దగాని దంతములచే నమలఁబడియుండు ద్రవ్యముగాని కల్కమనంబడును

త్రిఫలక్రమము

హరీతకత్రయం కుర్యాత్ షడేవ తు విభీతకా 197

ద్వాదశామలకం చైవ మి త్యేషా త్రిఫలా మతా,

మూడు కరకకాయలు ఆఱు తాడికాయలు, పండ్రెండు ఉసిరికకాయలు చేర్చిన నిది త్రిఫలయని వ్యవహరింపఁబడును

శీతకషాయము

శీతో రాత్ర్యుషితం ద్రవ్యం పలం శీతాంబు షట్పలే 198

ఒకపల ప్రమాణముగల ద్రవ్యమును నలియఁగొట్టి యాఱుపలముల నీటిలో బోసి యొకరాత్రియంతయు నుంచి యుందయమున వడియఁగట్టిన నది శీతకషాయ మనఁబడును

ఫాంటకషాయము

సద్యోధ్యుషితపూత స్తు ఫాంటో ద్రవచతుష్పలే,

ఒకపల ప్రమాణముగల ద్రవ్యమును నాలుగుపలముల నీటిలోఁబోసి కొంచము సేపుంచి వడియ గట్టిన నది ఫాంటకషాయమని వ్యవహరింపఁబడును.

—◉ పానకషాయము ◉—

పీతం చతుష్పలే నీరే క్షిప్త్వా ద్రవ్యచతుష్పలమ్ 199
సమాగృహీత మాహు స్త త్పాన మి త్యభిధీయతే,

నాలుగుపలముల ద్రవ్యమును నలియగొట్టి నాలుగు పలములనీటిలో వేసి వడియఁగట్టి త్రాగిన నది పానకషాయ మనఁబడును

—◉ కషాయపానవిధి ◉—

ప్రాత శ్చూర్ణం విభిన్నం వా క్వాథ్యం ద్వాదశనిష్కకమ్,
ప్రక్షాళ్య సలిలే శుద్ధే సమ్య క్పోధిత మశ్మనా 200
కృత్వా కీటాదిరహితం విశోధ్య క్షాళితం జలై,
సుధౌతే లోహవలయరక్షాబంధే తు మృన్మయే 201
పాత్రే తు లౌకికప్రస్థద్వయసమ్మితవారిణి,
ఆసుత్య వస్త్రబద్ధం త మాతపేఽగ్న్యంతికేఽపి వా 202
విధాయ సాయం నిర్ధూమం శనై ర్మృద్వగ్నినా పచేత్,
అష్టావశిష్టం చషకే శృతం వస్త్రాదకుంఠితాత్ 203
పశ్చా దుత్పూయ భిషజా ప్రాఙ్ముఖేన యథావిధి,
బ్రహ్మాదయ శ్శివరుద్రేంద్రభూచంద్రార్కానిలానలా 204
ఋషయ శ్చౌషధగ్రామ భూతసంఘాశ్చ పాంతు వః,
రసాయన మివ ర్షీణా మమరాణాం యథామృతమ్ 205
విషంవో త్తమనాగానాం భైషజ్య మిద మస్తు తే,
అతల్పష్ఠ శ్శుచి స్త్యక్తనిద్రాఘూర్ణేక్షణ పిబేత్ 206

కషాయముకాచఁ దగినద్రవ్యమును తీసికొని యుందయముననే దానిని మెత్తగానలియఁగొట్టి మఱియుం నట్టిద్రవ్యమును మొదట పొట్లు పురుగులు మొదలగునవి లేకుండ చూచి పరిశుద్ధమగు నీటితో కడిగి యాద్రవ్యమును పండ్రెండునిష్కములు తీసికొని పరిశుద్ధమగు మంటికుండకు లోహమయమగు

రక్షాబంధము గట్టి యాపాత్రలోఁ బూర్వము చెప్పఁబడియున్న ప్రమాణముగల రెండులౌకిక ప్రస్థముల నీరుఁబోసి యానీటిలోనీ ద్రవ్యమును వేసి బాగుగాఁ జేతితోఁ గలియఁగొట్టి యొకవస్త్రమును పైన వాసెనకట్టి పగలంతయు నెండలోఁగాని యగ్నిసమీపమునగాని యుంచి సాయంకాలము పొయిమీఁదఁ బెట్టి పొగరాకుండ సన్ననిమంటచే నెనిమిదవభాగము మిగులునట్లు కాచవలయును అట్లుకాచినదానిని గుడ్డచినుగకుండ వడియఁగట్టు వైద్యునిచే సిద్ధపఱచబడిన దానిని బ్రహ్మ దక్షుఁడు, అశ్వినులు, రుద్రుడు ఇంద్రుడు, చంద్రుడు, సూర్యుడు వాయువు అగ్ని ఋషులు, ఔషధసమూహములు భూతసంఘములు మిమ్మును రక్షించుగాక! ఋషులకు రసాయనమువలెను దేవతల కమృతమువోలెను, ఉత్తమనాగములకు విషమువలెను నీయౌషధము నీకుపకరించుగాక! అను నర్థముకల బ్రహ్మదక్షాదిమంత్రమును పఠించి శయ్యనుండి దిగి నిద్ర లేకుండ పరిశుద్ధుఁడై భక్తి కలిగియుండి యాకషాయమును వాసనచూడకుండను కంటితోఁ జూడకుండను త్రాగవలెను

## మతాంతరము

యత్క్షుణ్ణం శుచిభాజనస్థసలిలే
క్షిప్త్వా త్రియామం పుమాన్,
సంయూషం తు సమాగ్నినా హి విపచే
త్క్వాథం యథా యోజయేత్,
తత్క్వాథం భిషజాభిమన్త్రసహితం
పాత్రస్థితం పాయయేత్,
రోగాఘ్రాణవిచక్షణేనరహితం
పాత్రావకుంఠం పిబేత్ 207

కషాయద్రవ్యమును నలియఁగొట్టి పూర్వపుప్రమాణము ననుసరించి నీటిలోఁబోసి మూఁడుయామములుంచి పిమ్మట మందాగ్నిచేఁ గాచి వడియఁగట్టి

వైద్యునిమాజ్ఞఁబొంది వాసనజూడక విచక్షణజేయక, పాత్రలోకప్పియుంచిన యాకషాయమును త్రాగవలెను

ఔషధోచ్ఛిష్ట మిచ్ఛంతి యస్మా ద్వ్యాధ్యధిదేవతాః,
తతస్స్వవామతో భూమౌ కుర్యాత్పాత్ర మధోముఖమ్

వ్యాధిసంబంధమగు అధిదేవతలు మిగిలినయౌషధమును గ్రహింపనేతెంతురు కావున రోగి తనయెడమవైపున తాను త్రాగిన యౌషధపాత్రను బోరగిల వేయదగును

పీత్వా భుక్తవ దాస్థేయం యావ త్పీతం ప్రతిష్ఠితమ్,

ఆకషాయమును త్రావి యది తనశరీరంబున నిముడువఱకును భుజించినవాఁడువలెనే కూర్చుండవలెను

లాజం క్రముకఖండం వా యద్వా నాగలతాదళమ్ 209
రుచ్యర్థం చర్వయే త్పశ్చా ద్యావ త్పీతం ప్రతిష్ఠితమ్,

కషాయముత్రాగిన తర్వాత నోరు చేఁదగా నున్నయెడల పేలములుగాని పోకచెక్కగాని తమలపాకుగాని నమిలి ఉమియవలయును ఇతరమగు పదార్థమెద్దియు భుజింప గూడదు

కషాయసేవయం దపథ్యములు

పానీయం మోదకం క్షీరం తాంబూలం చామ్లకోరసః 210
పృథుకా ముద్గసూపం చ శర్కరా గుడ మాక్షికమ్,
ఖాదనం పానకం నేష్టం క్వాధే పీతే నృణాం పరమ్ 211

కషాయమును త్రాగినవారు నీటిని, ఉండ్రములు, పాలు, తాంబూలము, పులుసువస్తువులు అటుకులు పెసరపప్పు, పంచదార, బెల్లము, తేనె, నమలదగిన భక్ష్యములు, పానకము వీని వ్యర్జింపవలెను

దోషభేదముచేతఁ గషాయభేదము

వాతే తూష్ణం కఫే కోష్ణం పిత్తే రక్తేతు శీతలమ్,

సంసర్గేతు సమోష్ణం స్యా త్సన్నిపాతేఽల్పశీతలమ్ 212

వాతాధిక్యమునందు మిగులవేఁడికషాయమును, కఫాధిక్యమునందుఁ గొంచెదివేఁడికషాయమును, పిత్తాధిక్యమునందును, రక్తాధిక్యమునందును చల్లని కషాయమును, ద్వంద్వాధిక్యమునందు మిగులవేఁడి గానట్టియుఁ చల్లనగానట్టియుఁ కషాయమును త్రాగవలయును సన్నిపాతంబునందు కొంచెముచల్లారిన వేఁడికషాయమును త్రాగవలయును

తృషి గండూషయే త్తోయం పానక్వాథే త్వయం క్రమ,

కషాయము త్రాగినవెనుక దప్పయైనచో చలినీళ్లు పుక్కిలించి ఊయవలయును పానకషాయమునం దీచెప్పనరీతిని చరింపవలెను

రాత్రౌ దోషా ప్రకుప్యన్తి శమనాని తతో నిశి 213
కుర్యా త్సంశోధనా న్యహ్ని వమనాని విశేషత,

రాత్రులయందు దోషములు విశేషముగాఁ బ్రకోపమును జెందును, గాన రాత్రులయందు శమనకషాయములను, శోధనకషాయములను విశేషించి వమనకషాయములను పగలునందు నీయం దగును

కాలభేదంబుచేఁ గషాయప్రయోగము

నాడికాష్టమవేళాయాం రాత్రౌ క్వాథాదికం భవేత్ 214
అథవా భోజనా దూర్ధ్వం నాడికాత్రితయే గతే,

రాత్రి జామువోయినతర్వాతగాని, భోజనము చేసినపిమ్మట మూఁడుగడియలు గడచినతర్వాతగాని కషాయాదుల నుపయోగింపఁదగును

వాతజేషు వికారేషు ప్రాగ్భుక్తం క్వాథ ఇష్యతే 215
భుక్తమధ్యే పిత్తజేషు భుక్తాంతే కఫజేషు చ,
నాడీచతుష్టయే ప్రాత వినా భుక్త్వాఽధికాలతః 216
ప్రాతస్సేవ్యం తు భైషజ్యం, జీర్ణాన్నే ష్వేవ శస్యతే,
నిశాసు,చోషసి పిబేత్ ప్రాతః పేయం యదౌషధమ్ 217

వాతాధిక్యమునందు భుజించుటకు పూర్వమును, పిత్తాధిక్యమునందు భోజనమధ్యమందును, కఫాధిక్యమునందు భుజించిన వెనుకను, కషాయమును త్రాగవలయును మఱియు ప్రాతఃకాలమున నాల్గుగడియలకులోనను భుజించిన తర్వాత అన్నము జీర్ణమైనతర్వాత ప్రాతస్స్వీకషాయమును త్రాగవలెను రాత్రి తినిన అన్నము జీర్ణించిన తర్వాతనే త్రాగవలెను ఉదయమున బుచ్చు కొనునౌషధమును తెల్లవారకట్ల గూడ బుచ్చుకొనవచ్చును

కషాయాదులు తిరిగి కాచినచో దోషము

ఘృతం తైలం చ పానీయం కషాయం వ్యంజనాని చ,
పక్వశీతం పున పక్వం విషవద్ధంతి మానవమ్ 218

నేయి నూనె నీరు, కషాయము, కూరలు మొదలగునవి కాఁగిచల్లఁబడినపిమ్మట మరలఁ గాచినచో విషతుల్యంబై ప్రాణములు హరించును గాన కాగి చల్లఁబడినకషాయమును మరలఁ గాచఁగూడదు

పానపాత్రవిశేషము

వాతే కాంస్యం కఫే తామ్రం పిత్తే స్వర్ణం ప్రకల్పయేత్,
సంసర్గే కృష్ణలోహం తు సన్నిపాతే తు రౌప్యకమ్ 219
లోహాభావే తు మృత్పాత్రం స్థాలీభేదో నచేష్యతే,

వాతాధిక్యమునందు కంచుపాత్రయందును, కఫాధ్యిమునందు రాగిపాత్రయందును, పిత్తాధిక్యమునందు బంగారుపాత్రయందును ద్వంద్వాధిక్యమునందు లోహపాత్రయందును, సన్నిపాతమునందు వెండిపాత్రమునందునుబోసి కషాయమును త్రాగవలయును లోహపాత్రములు లేనియెడల మృత్పాత్రమునందు సేవింపఁదగును ఈభేదమును పాటింపనక్కరలేదు

భోజమతమునఁ గషాయభేదములు

పానగండూషపానీయసేకాశ్చ్యోతనసంజ్ఞితాః 220
వ్రణప్రక్షాళనముఖక్షాళనోష్ణోదకాని చ,

ఆస్థాపనం చ వమనం విరేక స్నానతోయకే 221
యవస్నేహాశ్రయాశ్చేతి క్వాథభేదా శ్చతుర్దశ,

పానకషాయము, గండూషకషాయము, పానీయకషాయము, సేక కషాయము, ఆశ్చ్యోతనకషాయము వ్రణప్రక్షాళనకషాయము ముఖప్రక్షాళనకషాయము, ఉష్ణోదకకషాయము, ఆస్థాపనకషాయము, వమనకషాయము, విరేచనకషాయము, స్నానకషాయము, యవాగూకషాయము, స్నేహకషాయము అని పదునాల్గు విధంబులగు కషాయంబులు భోజతంత్రంబునం జెప్పఁబడియె

ఈచెప్పఁబడిన పదునాల్గుకషాయంబులకల్పనావిధి యీక్రింద వివరింపఁబడును

౧ ఇరువదినాలుగుపలములనీటిలో నొకపలప్రమాణముగల ద్రవ్యమును జేర్చి ఎనిమిదవపాలు మిగులునట్లు కాచిన నాకషాయము పానకషాయమనఁబడును (త్రాగుటకుపయోగించుకషాయము), ౨ నాలుగుభాగముల నీటిలోనొకభాగముద్రవ్యమును జేర్చి యైదవపాలుమిగులునట్లు కాఁచఁబడిన కషాయము గండూష (పుక్కిలించుటకుపయోగించు) కషాయమనంబడును ౩ కర్షప్రమాణంబుగల యోషధిని అర్ధపలప్రమాణముగలనీటిలోఁ బోసి నాల్గవ పాలుమిగులునట్లు కాచఁబడినకషాయము పానీయకషాయ మనఁబడును ౪ ద్రవ్యముకంటె నాల్గింతలు నీళ్లుపోసి యెనిమిదవపాలు మిగులునట్లు కాచిన నది సేక (తడుపుట కుపయోగించు) కషాయ మనఁబడును ౫ ద్రవ్యముకంటె నాఱుభాగములు నీరు పోసి యాఱవపాలు మిగులునట్లుకాచిన నది యాశ్చ్యోతన (నేత్రమునం బోయుట కుపయోగించు) కషాయ మనంబడును ౬ ద్రవ్యమును మూఁడింతల నీటిలోఁబోసి పండ్రెండవపాలు మిగులునట్లు కాఁచఁబడిన కషాయము వ్రణప్రక్షాళన (వ్రణములను కడుగుట కుపయోగించు) కషాయ మనఁబడును ౭ ద్రవ్యముకంటె నెనిమిదిరెట్లు నీళ్లుబోసి తొమ్మిదవ

పాలుమిగులునట్లుకాచఁబడిన కషాయము ముఖప్రక్షాళన (ముఖమును కడుగు కొనుట కగు) కషాయమనఁబడును ౮ మూఁడవపాలు మిగులునట్లు కాచఁబడిన కషాయ ముష్ణోదక (వేఁడినీళ్లు) కషాయ మనఁబడును ౯ ద్రవ్యముకంటె నాలుఁగురెట్లునీరు పోసి యేడవపాలు మిగులునట్లు కాచఁబడినదియాస్థాపన(ఆస్థాపనవస్తియం దుపయోగించు) కషాయ మనఁబడును ౧౦ ద్రవ్యముకంటె మూఁడింతలునీరుపోసి సగముమిగులునట్లు కాచ బడిన వమన(వమనము చేయుట కగు) కషాయ మనఁబడును ౧౧ ద్రవ్యముకంటె నాలుఁగురెట్లు నీరుపోసి యెనిమిదవపాలు మిగులునట్లు కాచఁబడినది విరేచన(విరేచనము చేయుట కుపయోగించు) కషాయమనఁబడును ౧౨ ద్రవ్యముకంటె నలువదిరెట్లు నీరుపోసి సగము మిగులునట్లుకాచఁబడినది స్నాన(స్నానముచేయుటకుపయోగించు)కషాయమనఁబడును ౧౩ ద్రవ్యముకంటె నలువదినాల్గు రెట్లునీళ్లుపోసి యెనిమిదవ పాలు మిగులునట్లు కాచిన యవాగూ (యవ గువును పచనముచేయుట కుపయోగించు) కషాయ మనఁబడును ౧౪ ద్రవ్యముకంటె నాల్గింతలు నీరు పోసి నాలవభాగము మిగులునట్లు కాచఁబడిన కషాయము స్నేహ (తైలము మొదలగునవి పచనము చేయుట కుపయోగించు) కషాయ మనఁబడును

### అన్యమతంబునఁగషాయకల్పన

మూలత్వక్సారకాండాద్యం క్వాథ్యమాతపశోషితమ్
శోషయిత్వాఽణుశశ్ఛేద్యం ఛేద్యం సర్వం విభిద్య చ,
ప్రక్షాళ్య సలిలైశ్శుద్ధై రవక్షుణ్ణా ములూఖలే 223
శుద్ధే రూక్షే ప్రలిప్తే చ శ్లక్ష్ణమృద్గోమయాదిభిః,
తామ్రే కటాహే సుమహాత్యాయసే మృణ్మయేఽథవా 224
సంశ్లిష్టకంఠసూత్రేణ సలోహావలయేన చ,
యావద్వా ముక్తరసతా క్వాథ్యద్రవ్యస్య జాయతే 225

తావదాసేచయేత్తోయం శోషయేచ్చ యథాక్రమమ్,

వేళ్లు పట్ట సారము, కొమ్మలు మొదలగు ద్రవ్యములను, ఎండలో నెండఁబెట్టి వానిని ముక్కలుగాఁ గొట్టి యందలి వ్యర్థపదార్థములను తీసివేసి పరిశుద్ధమగు నీటిలోఁ గడిగి బోటిలో వేసి మెత్తఁగా నలియఁగొట్టవలెను పిమ్మట పరిశుద్ధమగు రాగిపాత్రకుఁగాని, యినుపపాత్రకుఁగాని, మంటిపాత్రకుఁ గాని, పైతట్టున బంకమన్ను గోమయము వీనిని బూసి యాపాత్రలో నీద్రవ్యమును బోసి లోహమయమగు కటాయమును గట్టి, లేక దానియీలి దారముతో బిగియించి యేద్రవ్యమున కెంతనీరుబోసిన సారంబు దిగునో యంత నీరుబోసి యథాశాస్త్రముగా కాచవలయును ఇది కషాయమును గాచునట్టి రీతి యనఁబడును

పరిమాణము చెప్పనిస్థలమున కృష్ణాత్రేయమతము

కృష్ణాత్రేయ కషాయాణాం కల్పనా మేవమబ్రవీత్ 226
అనిర్దిష్టే ప్రమాణేతు క్వాథ్యానాం చ ద్రవస్యచ,
ద్రవ్యాణి షోడశగుణే సలిలే క్వాథయే ద్భిషక్ 227
చతుర్థ శేష పూత స్తు కషాయో గ్రాహ్య ఇష్యతే,

ద్రవ్యములకుగాని, నీటికిగాని పరిమాణము చెప్పనితావున ద్రవ్యముకంటె పదునాఱురెట్లునీరుబోసి నాలవపాలు మిగులునట్లుకాచి వడియఁగట్టి కషాయమును గ్రహింపవలయునని కృష్ణాత్రేయతంత్రంబునఁ జెప్పఁబడెను

కషాయమున మాత్రాదులు చేర్చునపుడు పరిమాణము

యదిక్వాథేష్వమీషూక్తం తోయా దన్యద్ద్రవం భవేత్
మూత్ర క్షీర సురా మండ మస్తు తక్రాఽమ్ల కాంజికమ్,
జలవత్ షోడశగుణం తస్యైషాం పాదశేషితమ్ 229
స్నేహాధిసాధనా యోక్తం నిర్యాసో యత్ర యత్ర హి,
తత్రాఽపి షోడశగుణః షష్ఠోఽయం పరిగృహ్యతే 230

కషాయంబులయందు జలమువిడిచి మాత్రము పాలు, కల్లు, గంజి, పెరుఁగు మీఁదినీళ్లు, మజ్జిగ, పుల్లకల వీనిని జేర్చునెడల నీరువలెనే పదునారు రెట్లుపోసి నాలవభాగము మిగులునట్లు కాచవలెను మఱియుఁ దైలాదులనువందు నపుడుగూడ ద్రవ్యముకంటెఁ బదునారురెట్లు నీరుపోసి నాలవభాగము మిగులునట్లు కాచవలెను

—తైలాదులయందు కషాయమాత్రమునే చేర్చునెడల జలపరిమాణము—

కషాయ ఏవ చేత్తత్ర ద్రవార్థం కేవలం భవేత్,
ద్రవ్యస్నేహసమం క్వాథ్యమత్ర పక్షే ప్రయుజ్యతే 231

తైలాదులయందు కషాయమాత్రమే చేరునపుడు తైలమునకు సమంబుగా ద్రవ్యముగ్రహించి పదునారురెట్లు నీరుబోసి కషాయముకాచవలెను

—అనుక్తజలాదిపరిమాణము—

తదాఽన్యదపి తత్రోక్తం ద్రవ్యం స్నేహాదికే యది,
తతోఽనురూపం సంఖ్యాయ ద్రవ్యం తోయేన సాధయేత్
ద్రవ్యం స్నేహసమం క్వాథ్య మన్యత్రాపి ద్రవే సతి,
న తత్ర యుజ్యతే తస్మా దనురూపం ప్రకల్పయేత్ 233

తైలములఁ గాచుపట్లను కషాయమెగాక క్షీరాదిద్రవ్యములను గూడ చేర్చునెడల తైలమున కినుమడిగాని, నాలుగురెట్లుగాని, కషాయద్రవ్యమును జేర్పందగును క్షీరాదిద్రవ్యములను స్నేహమునకు సమభాగముగాఁ జేర్చవలెను కావున కషాయము స్నేహమునకు సమముగాక ననురూపముగాని నినుమడిగాని నాల్గురెట్లుగాని చేర్చవలెను

—కషాయమునఁజేర్చు ద్రవ్యములనుబట్టి కషాయజలపరిమాణము—

క్వాథే తు కఠినే మధ్యే మృదున్యపి యథాక్రమమ్,
కేచిద్వదంతి పానీయం షోడశాష్టచతుర్గుణమ్ 234

కషాయంబున కఠినద్రవ్యములను జేర్చునెడలఁ బదునాఱింతలు జలమును, మధ్యద్రవ్యములను జేర్చుపట్ల నెనిమిదింతలజలమును, మృదుద్రవ్యములను జేర్చుతఱి నాల్గింతలునీటిని బోసి కషాయమును గాచఁదగు నని కొందఱు నుడువుచున్నారు

ద్రవ్యభేదంబుచే కషాయపాకకాలనిర్ణయము

ద్వాదశాహాంతు సారాణాం సర్వేషాం పాక ఇష్యతే,
సప్తాహం సర్వమూలానాం వల్లీనాంతు త్ర్యహం స్మృతమ్
ఏకాహం శాకజాతీనాం పత్రపుష్పఫలాత్మనామ్,
కందస్య శుంఠీలశునముస్తాదే రౌషధస్య చ 236
ముద్గ మాష కుళుత్థాది ధాన్యానాం యవలాజయోః,
మాంసస్య చే త్యయం స్నేహకషాయే కాలనిర్ణయ 237

తైలకషాయమును కాచునపుడు సారద్రవ్యములను పండ్రెండు రోజులు కాచవలయును వేళ్లను ఏడుదినంబులు, తీగలను మూఁడుదినంబులు, శాకజాతులు, పువ్వులు, ఆకులు పండ్లు శుంఠి, వెల్లుల్లి, తుంగగడ్డలు మొదలగు దుంపలు, పెసలు, మినుములు ఉలవలు మొదలగు శింబిధాన్యములు యవలు లాజలు మొదలగునవి మాంసము యివి యొక్కరోజు కషాయము గాచవలెను

మతాంతరమున పాకకాలము

పత్రం కంద ప్రసూన త్వక్ఫలం తత్ర విపాకతః,
ఏక ద్వి త్రి చతు పంచయామై ర్వీర్యం విముంచతి 238

ఆకుల నొకజాము దుంపలను రెండుజాములు, పువ్వులను మూఁడు జాములు, పట్టల నాలుగుజాములు, పండ్లనైదుజాములు కాచినయెడల వానిసారము వచ్చును పూర్వమతంబున నివియన్నియు నొక్కదినంబున గాయందగిన దని చెప్పఁబడెను ఈమతంబున నాదినంబున నెన్నిజాములు దేనికిఁ జాలునో చెప్పఁబడెను

— క్షీరాదులం దుదక మావశ్యకము —

క్షీర మస్త్వారనాళానాం పాకో నాస్తి వినాఽంభసా,
తస్మాద్వీర్యం న ముంచంతి తోయం దద్యాచ్చతుర్గుణమ్

ఏతైలపాకంబుననైన క్షీరాదికమునుమాత్రము చెప్పి యుదకంబును చెప్పకపోయిన నచ్చట కేవల క్షీరాదికముచేఁ దైలమునందు వీర్యము చేరదు కాన పాలు, పెరుఁగుమోఁదినీరు కలి వీని జెప్పినపుడు క్షీరాదులకు నాల్గింతలు నీరుపోసి తైలపాకంబు చేయఁదగును

— మాంసంబుజేర్చునపుడు ద్వైగుణ్యాభావము —

అవిశేషేణ మాంసస్య యత్ర పాకో విధీయతే,
మాంసస్య చార్ద్రద్రవ్యత్వా ద్ద్వైగుణ్యం న ప్రకల్ప్యతే

స్నేహపాకంబున మాంసమును జేర్చునప్పుడు విశేషము జెప్పకున్నను మాంసము ఆర్ద్రద్రవ్య మగుటచేత నినుమడి చేర్పందగదు

— అనుక్తమాంసపరిమాణము —

మాంసప్రమాణానుక్తౌ తు మాంసం స్నేహసమం పచేత్,

మాంసపరిమాణంబు చెప్పనితావున మాంసమును తైలమునకు సరిగాఁ ప్రయోగింపఁదగును

పిశితోక్తౌ జలానుక్తౌ జలమానం చతుర్గుణమ్ 241
మాంసమాన మనుక్తంచే త్తత్ర మాంసం చతుర్థకమ్,

ఏయౌషధంబుననైన మాంసపరిమాణమును జెప్ప జలపరిమాణముచెప్ప కుండినచో మాంసమునకు నాలుగింతలు చేర్పందగును జలపరిమాణముచెప్పి మాంసపరిమాణమును నుడువనిపట్ల జలములో నాలవభాగము మాంసంబును జేర్పంజనును

### స్నేహపాకంబున మాంసకషాయము

స్నేహపాకే తు మాంసస్య కషాయస్స్యాచ్చతుర్గుణ
స్నేహాద్ద్విగుణితం మాంసః చతుర్భాగావశేషితమ్,
అన్యత్కషాయే సంయుక్తే మాంసం స్నేహసమం పచేత్

తైలపాకంబున మాంసకషాయము మాత్రము జేయునపుడు తైలంబు కంటె మాంసమును రెండింతలుగా గ్రహించి మాంసముకంటె నాలుగింతలు నీళ్లు బోసి నాలవభాగము మిగులునట్లు కాచవలయును స్నేహ కషాయింబులు మాత్రమేకాక మఱికొన్ని ద్రవద్రవ్యంబులుగూడఁ జేరునపుడు మాంసమును తైలమునకు సమభాగంబుగాఁ జేర్పఁదగును

### కషాయశోషణంబున జలనిక్షేపణక్రమము

ప్రశోషణే సతి క్వాథే ప్రమాదాత్పరిశుష్యతి,
యథోక్తార్థజలం దత్వా ద్విభాగ మవశేషయేత్ 244
మహావీర్య మిదం విద్యాత్పశ్చాచ్ఛుష్కే విషోపమమ్,

కషాయమును గాచునపుడు ప్రమాదవశంబున నాకషాయ మిగిరి పోయినపుడు పూర్వము చెప్పఁబడిననీటిలో సగముపోసి యందు సగము మిగులునట్లు కాచవలెను ఇందెద్దియు దోషంబులేదు మరల నింకినచో నీరుకలిపిన నది విషతుల్యంబై ప్రాణములు హరించును గాన మరల నీరు కలుపఁదగదు

### అనుక్తస్నేహపరిమాణము

తత క్వాథ పరిస్రావ్య సమ్యక్స్నేహేన యోజయేత్
స్నేహపాకేఽప్రమాణోక్తాచతుర్గుణవివర్ధితమ్,
కల్కాత్స్నేహో ద్రవం చ స్యాన్నన్యతే శౌనకః పునః

ఈచెప్పఁబడినప్రకారము సిద్ధమగు కషాయమును వడగట్టి తైలంబున జేర్పఁదగును తైలాదుల ప్రమాణంబు నుడువనిపట్ల కల్కద్రవ్యముకంటె

నాలుగింతలు స్నేహద్రవ్యమును స్నేహద్రవ్యముకంటె నాలుగింతలు ద్రవద్రవ్యమునుబోసి స్నేహపాకము చేయందగు నని శౌనకుఁడు చెప్పుచున్నాఁడు.

ద్రవభేదంబుచేఁ గల్కపరిమాణము

స్నేహే సుసిద్ధే శుద్ధాంబు నిక్వాథస్వరసై క్రమాత్,
కల్కస్య యోజయే దంశం చతుర్థం షష్ఠమష్టమమ్ 246

ఉదకమును జేర్చి తైలము గాచునప్పుడు తైలమునకు నాలవపాలు కల్కము జేర్పవలయును కషాయమును జేర్చి తైలపాకము చేయునప్పుడు కల్కమును తైలమునకు నాఱవపాలును స్వరసమును జేర్చి తైలపాకమును జేయునపుడు కల్కము తైలంబునకు నెనిమిదవపాలును చేర్పందగును

స్నేహే సిధ్యతి శుద్ధాంబునిక్వాథస్వరసైస్సహ,
కల్కస్య యోజయే దంశ మష్టమం స్వరసే యథా 247

జలముతోను కషాయముతోను, స్వరసముతోను గూడ స్నేహమును సాధించునపుడు స్వరసమునందు వలె కల్కము నెనిమిదవపాలు గ్రహింపవలయును

తైలస్య సదృశా భాగా ప్రమాణం యత్ర నేరితమ్,
పేషయిత్వా దృఢం నీరే స్నేహపాకే ప్రయోజయేత్
కల్కేతర చ్చ భైషజ్య మనిరూపితకల్పనే,

తైలద్రవ్యములకు భాగములు, పరిమాణము చెప్పనితావున ద్రవ్యములను తైలసమానముగా నీటితో నూరి తైలంబులోచేర్చి కాచవలయును ఈరీతిగనే యితరయౌషధ ద్రవ్యములనుగూడ కల్కముగా నుపయోగింపవలయును

అనుక్తకల్కాది నియమము

కుర్యాత్కల్కౌషధై క్వాథం క్వాథేఽనుక్తే యథోచితమ్
తథా కల్కౌషధాఽనుక్తే కల్కం క్వాథౌషధై రపి,

తైలయోగములందు కల్కమాత్రమునుచెప్పి కషాయము చెప్పకుండినచో నచ్చట కల్కద్రవ్యములను కషాయంబుగాఁగూడ నుపయోగింప వలెను కషాయద్రవ్యములను మాత్రముచెప్పి కల్కమును నుడువనియోగంబుల కషాయద్రవ్యములనే కల్కముగాఁ బ్రయోగింపఁ జనును

అనుక్తప్రమాణమం దన్యమతము-చరకప్రమాణము

వైద్యబుద్ధివికాసార్థ మిద మన్య త్ప్రకాశ్యతే 251
క్వాథ్యానామౌషధానాం హి ప్రమాణంయత్ర నోదితమ్,
చతుర్గుణం తు నిర్దిష్ట మన్యత్ క్షీరాదికం ద్రవమ్ 252
కషాయాద్యౌషధానాం హి తత్ర కార్యం చతుర్గుణమ్

వైద్యుని బుద్ధివికాసముకొఱకు చరకోక్తమగు మఱియొక విధమును జెప్పెదను కషాయద్రవ్యములకు పరిమాణము నుడువనియోగంబునఁ దైలము కంటె నాల్గింతలు కషాయద్రవ్యమును జేర్చిపదునాఱింతలు నీరుబోసి నాలవపాలు మిగులునట్లు కాచి తైలంబునఁ జేర్పందగును అటుగాక, కషాయము, పాలు మొదలగు ద్రవ్యములను జేర్చునప్పు డన్నియుఁ గలిసి తైలమునకు నాల్గింతలు జేర్పందగును

ఉదాహరణ మ త్రోక్తం మహాకల్యాణకం ఘృతమ్ 253

పైనజెప్పఁబడిన పరిభాషకు చరకసంహితయందు చికిత్సాస్థానంబున బదునాలవయధ్యాయంబున నున్మాదమునకుఁజెప్పఁబడిన మహాకల్యాణఘృతముదాహరణంబుగానున్నది ఈయోగంబునందలి కషాయద్రవ్యములకుఁబరిమాణము చెప్పియుండలేదు మఱియు నీఘృతంబున క్షీరప్రయోగము కానవచ్చుచున్నది అట్టిక్షీరము ఘృతముకంటె నాలుగింతలు చెప్పఁబడుచున్నది కాన కషాయద్రవ్యములకుఁ బరిమాణము చెప్పక క్షీరమునుగూడఁ జెప్పునపుడు కషాయము, క్షీరము గూడ నాల్గింతలు చేర్పవలయు నని యభిప్రాయము

## మఱియొక చరకప్రమాణము

ఏవ మే వౌషధాదీనాం ప్రమాణం యత్ర నోదితమ్,
ద్విగుణం చ వినిర్దిష్ట మన్యత్ క్షీరాదికం ద్రవమ్ 254
కషాయ ద్వ్యౌషధానాంహి ద్విగుణం తు ప్రయుజ్యతే,
వాసాదికం జ్వరే ప్రోక్త మత్రోదాహరణం స్మృతమ్

పూర్వమువలెనే కషాయద్రవ్యములకుఁ బరిమాణము చెప్పకున్నచో క్షీరాది మనగూడఁ జేర్చునప్పుడు కషాయము క్షీరము ద్విగుణముగా గూడఁ జేర్పఁదగును ఈపరిభాషకు చరకసంహితయందు చికిత్సాస్థానంబున మూఁడవ యధ్యాయంబున జ్వరమునకుఁ జెప్పఁబడిన వాసాఘృత ముదాహరణంబై యున్నది ఈయోగంబున కషాయ ద్రవ్యములకు పరిమాణము చెప్పయుండలేదు క్షీరమునకు ద్విగుణప్రయోగమమాత్రముగలదు కషాయద్రవ్యములు, క్షీరముగూడ ద్విగుణంబుగా జేర్పవచ్చును చరకంబునఁ జెప్పఁబడిన యూవాసాఘృతంబుచే నీపరిభాష యుత్పన్నమై యున్నది

## మూఁడవచరకోదాహరణము

నిర్దిష్టం క్షీర మన్యచ్చ[త్ర]ద్రవం యత్ర చతుర్గుణమ్,
క్వాథ్యౌషధానాం మానం చ ప్రోక్తం నోక్తం జలస్యతు.
తత్రౌషధవశా దేవ సంఖ్యా క్వాథస్య గమ్యతే,
యథా తు పరిభా షేష్టా య షోడశగుణోదక 257
చతుర్థశేష క్వాథ స్తు తత్రద్రవ్యచతుర్గుణమ్,
అత్ర సాహచరంతైల ముదాహరణ మిష్యతే 253

ఏయోగంబున కషాయద్రవ్యములకు క్షీరంబునకు ప్రమాణము చెప్పఁబడి యుదకంబునకుఁ బరిమాణము చెప్పఁబడకుండునో యచ్చట సామాన్యపరిభాషలంబోలె పదునాఱింట్లు నీరుపోసి నాలవభాగము మిగులునట్లు కాచి తైలమునకు నాల్గింతలు జేర్పవలయును ఈపరిభాషకు చరకసంహిత యందు

చికిత్సాస్థానంబున నిరువదెనిమిదవయధ్యాయంబున వాతవ్యాధికి జెప్పఁబడిన సహచరతైల ముదాహరణముగానున్నది ఈతైలంబున కషాయద్రవ్యమునకుఁ తైలంబునకు క్షీరంబునకు పరిమాణము చెప్పబడియెను ఉదకమునకు చెప్పఁ బడియుండలేదు కాన చెప్పనిపట్టున ద్రవ్యముకంటె పదునాఱింతలజలము పోసి నాలవభాగము మిగులునట్టుఁ గాచి తైలముకంటె నాలుగింతలు జేర్చ వలెను

### నాల్గవచరకప్రమాణము

యత్రౌషధే కషాయస్య ద్రవ్యం నోక్తం ప్రమాణత,
ప్రమాణేన తథా నోక్తం స్నేహాక్షీరాదికం భవేత్
తుల్యం క్వాథేన దాతవ్యం తత్ర క్షీరాదికం ద్రవమ్,
కర్తవ్యం చ తథా తత్స్యా ద్యథా స్నేహచతుర్గుణమ్
గాల్మకో మిశ్రక స్నేహ ఉదాహరణ మత్ర హి
ఏవం తు ద్విగుణ స్నేహే త్రిగుణేన చ కీర్తితే 262
క్షీరాదికే ద్రవే కార్యం కషాయగ్రహణం తథా,
యథా కషాయసహితో ద్రవ శ్చాపి చతుర్గుణ 263

ఏయోగంబున కషాయద్రవ్యమునకుమాత్రము పరిమాణము చెప్పబడునో ద్రవము క్షీరము తైలముగూడ పరిమాణంబుచే చెప్పఁబడకుండునో అచ్చటనే క్వాథమునకు సమముగా క్షీరాదికమును జేర్చి ఈరెండును తైలమునకు నాలుగింత లగునట్లుగా జేర్చవలయును ఈపరిభాషకు చరకసంహితయందలి చికిత్సాస్థానంబున నైదవ యధ్యాయమున గుల్మమునకుఁ జెప్పఁబడిన మిశ్రకస్నేహ ముదాహరణముగానున్నది ఇందు కషాయద్రవ్యమునకు, ప్రమాణముచెప్ప క్షీరము, తైలము వీనికి పరిమాణము చెప్పియుండలేదు ఇట్లనే స్నేహపాకంబున ద్రవ్యములకంటె ద్విగుణముగా స్నేహమును క్షీరాదికము త్రిగుణముగాను చెప్పినచోట కషాయముతోగూడిన అన్నిద్రవములం స్నేహముకంటె నాల్గింత లగునట్లు చేర్చవలెను

—◎ ఐదవచరకోదాహరణము ◎—

కషాయ కర్గ్యతే యత్ర ప్రమాణం చా_త్ర నోదితమ్,
తత్రాఽపి చ ప్రయోక్తవ్యం స్నేహాత్కాథశ్చతుర్గుణమ్.
పంచమూలకపిణ్యాకతైలం వాతచికిత్సితే,
పర్యతే యత్ర దేతస్మిన్నుదాహరణ మిష్యతే 265

ఏయోగంబున కషాయమునకు పరిమాణముచెప్పఁబడకుండునో అచ్చట తైలముకంటె నాల్గింతలు చేర్పందగును ఇందుకు చరకసంహితయందు, చికిత్సాస్థానంబున నిరువదెనిమిదవయధ్యాయంబునవాతచికిత్సయందుఁజెప్పఁబడిన ణ్యాకతైల ముదాహరణముగాఁ గన్నది ఇందు కషాయమునకు పరిమాణము చెప్పఁబడియుండలేదు అందుచేత తైలముకంటె నాల్గింతలు చేర్పందగును.

బహూని యత్ర పర్యంతే క్వచిత్స్నేహే ద్రవాణి తు,
బహూనామప్యమీషాం తు ప్రమాణం చ న పర్యతే
సర్వేషాం సముదాయస్స్యాత్తత స్స్నేహాచ్చతుర్గుణమ్,

ఏయోగంబున నైదాఱు ద్రవములు చెప్పఁబడియుండి వాని కన్నిటికిఁ గూడ పరిమాణము చెప్పఁబడకుండునో అచ్చట గన్నియుఁ గూడ కలిపి తైలమునకు నాలుగింతలు చేర్పందగును

—◎ మతాంతరము ◎—

పృథక్స్నేహసమం కుర్యాత్పంచప్రభృతి తద్ద్రవమ్
బహుద్రవ కిల స్నేహో వీర్యవాన్ జాయతే ధ్రువః,

ఏయోగంబుననైన నైదు మొదలు ద్రవంబులఁ జేర్చునపు డొక్కొక ద్రవంబును తైలంబునకు సమంబుగాఁ జేర్పవలయును అధిక ద్రవంబులుగల (పాకమైన) స్నేహము వీర్యవంతమైయుండును

—◎ స్నేహపాకమునందు మతాంతరము ◎—

క్వాథ్యశ్చతుర్గుణే నీరే పాద స్థస్స్యాచ్చతుర్గుణమ్ 268

స్నే హే స్నేహసమం క్షీరం కల్కం స్యాత్స్నేహపాదకమ్,

కషాయద్రవ్యమునకు నాలుగింతలు నీరుపోసి నాలవభాగము మిగులునట్లు కాచి తైలమునకు నాలుగింతలు పోయవలయును పాలు తైలమునకు సమంబుగా పోయవలెను కల్కద్రవ్యమును తైలము లో నాలవభాగము గ్రహింపవలెను అని కొందఱాచార్యులు చెప్పుచున్నారు

## స్నేహంబున క్షీరాదినిక్షేపణము

స్నేహస్య శక్తిరత్యర్థం క్షీరయోగాత్ప్రరీ భవేత్ 269
తస్మాత్కాథాదిమధ్యేషు స్నేహస్య తు సమం పయ,
వాతపిత్తప్రదోషేషు ద్విగుణం వా ప్రయోజయేత్ 270

స్నేహంబున క్షీరాదులను జేర్చుటచేత స్నేహమునకు శక్తి విశేషంబుగా లభించును కాన స్నేహపాకమున స్నేహసమంబుగా క్షీరంబును జేర్పందగును వాతదోషము పిత్తదోషము గలవారికి నుపయోగించునెడల స్నేహమునకు ద్విగుణంబుగా గూడ పాలనుపయోగింపఁదగును

## స్నేహపాకమునం దన్యమతము

లాజామాషకుళుత్థముద్గలశునం శుంఠీయవాఖ్యాథయే
త్సద్య స్త్వేవకషాయపాకవిధినా స్నే హేనసంయోజయేత్
కుర్యాత్పీడన మేకరాత్రపరత,స్స్యాదిరత్రాస్యతే
స్నే హే మస్తు పయోరసైశ్చ సహితే ద్వాభ్యాం దినా
భ్యాం పరమ్ 271

లాజలు, మినుములు, ఉలవలు, పెసలు వెల్లుల్లి, శొంఠి, యవలువీనితో కషాయపాకానుసారంబుగఁ దత్కాలంబున నేగాచఁబడినకషాయమును వడియగట్టి తైలంబున గలపి, యొకదినము పాకముచేసి రెండవదినమున తైలమును వడియగట్టి తీసికొనందగును ఆట్టితైలమున కలి మజ్జిగ, పెరుఁగు పన్నీరు పాలు,

మాంసరసము ఇవిచేరునెడల రెండురోజులు వదలి మూడవనాడు వడియ గట్టి యాతైలమును గ్రహింపఁదగును

స్నేహపాకంబున మఱియొకమతము

శుంఠీ ధాన్య రసోన లాజ కుసుమం మాంసం చ సద్య
పచేత్, వల్లీ కంద ఫల త్వచ స్త్రిదివసం మూలం తు
సారం పున, స్సప్తద్వాదశవాసరేష్వ్రు చ తత్కాథేషు
పక్వా క్రమాత్, ఏకాహం త్రిదినం చ పంచదిన మే
వోర్ధ్వం తత పీడయేత్ 272

శుంఠి, దనియాలు, వెల్లుల్లి లాజలు పువ్వులు మాంసము ఇవిచేరు నపుడు కషాయము చేర్చి తత్కాలమునందే పచనముగావించి వడియగట్ట వలెను తీగలు, దుంపలు, పండ్లు, పట్టలివి నుపయోగించునపుడు కషాయము మూడుదినములు కాచవలయును వేళ్లుచేరునపు డేడుదినంబులు సారము జేరు నపుడు పండ్రెండుదినంబులు కాచవలెను అట్టికషాయంబును తైలంబునంగలిపి మొదలుచెప్పబడినకషాయ మైనచో నొకదినము మ్మటను రెండవకషాయమైన మూఁడుదినంబులఎమ్మటను, మూడు, నాలుగు కషాయంబులయినచో నైదు దినంబుల ఎమ్మటను వడియగట్టి యుపయోగింపందగును

స్నేహపాకమునం దన్యమతము

వల్లీశాకాదికే పాకే త్రిరాత్రాత్సంపరిస్రుతే,
స్నేహం తత్ర విపక్వం తు ద్విరాత్రా త్పరిపీడయేత్
ఇత్యాదిస్నేహపాకోక్తభేదాః తంత్రాంతరోదితాః,
ఆలోడ్య తత్ర తత్రోక్తం తత్తద్యుక్త్యా ప్రయోజయేత్

తీగలు శాకములు మొదలగునవి చేరునపుడు కషాయంబును మూఁడు దినంబులు కాచి పిమ్మట వడఁగట్టి యాకషాయంబును తైలంబునం జేర్చి రెండుదినంబులు పక్వము చేసి ఎమ్మట వడియ బోసి యుపయోగింపం దగు.

ఈప్రకారంబుగా స్నేహపాకం బనేకతంత్రంబుల ననేకవిధంబులుగా వర్ణింపఁబడెను కర్తదక్షుండగు వైద్యుఁడాయాభేదంబుల బాగుగ నాలోచించి యాయాయోగంబులందు వినియోగింపవలెను

## స్నేహావపచనక్రమము

తతశ్శాస్త్రదినే తత్తత్స్నేహావపచనోచితే,
సుఖోపవిష్టస్సుమహత్యాసనేఽనన్యమానస 275
ఉదఙ్ముఖః ప్రాఙ్ముఖో వా లోహదర్వ్యాఽవఘర్షయన్,
సమవృత్తాగ్రయా సర్పఫణాకృత్యా ప్రదక్షిణమ్, 276
బుద్ధిమానపదగ్ధం తు సమంతా దవలోకయన్,
స్నేహం సద్రవ్యే ద్యనిర్దిష్టం పాకావధి శనైః పచేత్ 277
పతిపుత్రవతీ నారీ కన్యా వా కృతమంగళా,

పూర్వోక్తప్రకారంబుగ సిద్ధముగావింపఁబడిన కషాయమును తైలంబు మొదలగువానిం శాస్త్రోక్తంబగు దినంబున దానిని పొయిపై నుంచవలెను తర్వాత ననుకూలంబగు నాసనంబున నధిష్ఠించి యేకాగ్రమనస్కుఁడై, యుత్తర ముఖంబుగాఁగాని ప్రాఙ్ముఖంబుగాఁగాని కూరుచుండి, సమ బగు లావు,చివర కలిగి, పాముపడగంబోలు నినుపతెడ్డుచే నాతైలంబును గలియఁబెట్టుచు నడుగు భాగము మాడకుండునట్లు పరీక్షించుచు పాకము వచ్చువఱకు మందాగ్నిచే పచనము గావింపవలయును ఇట్టి స్నేహపాకంబును పతిపుత్రవంతురాలగు యువతికాని, కృతమంగళయగు కన్యగాని గావింపవచ్చును

## తైలపాకంబును దెలియునుపాయంబులు

నాంగులిగ్రాహితా కల్కే సస్నేహోఽగ్నౌ ర్న శబ్దవాన్
వార్ణాదిఫేనం చ యదా త దైనం శీఘ్రి మావహరేత్,

తైలాదులం గాచునపు డందలికల్కద్రవ్యము ను వ్రేళ్లతో నలిపినచో పయ్యెది వ్రేలి కంటుకొనకుండి స్నేహంబును నిప్పులోనుంచిన చిటచిట యను

శబ్దము వినఁబడక తైలమందు రంగు బాగుగనుండి సువాసనగొట్టుచు నురుగు గట్టినచో తైలంబు సిద్ధమైనదని యెఱింగి యాతైలమును త్వరలో క్రిందికి దింపవలెను మఱియుం —

శబ్ద స్యోపరమే ప్రాప్తే ఫేన స్యోపరమే తథా
గంధ-వర్ణరసాదీనాం సంపత్తౌ సిద్ధి మాదిశేత్,
ఘృతస్యైవం విపక్వస్య జానీయాత్కుశలో భిషక్
ఫేనోఽతిమాత్రం తైలస్య శేషం ఘృతవ దాదిశేత్

అను వచనప్రకారము ఘృతము పక్వమగు సమయంబున శబ్దముణంగుట, నురుఁగు పోవుట మంచివాసనయుం మంచిరంగు రసము కల్గుట సంభవించును తైలంబును పచనముచేయునపుడును గూడ వెనుకటిలక్షణంబు లన్నియు నుండును గాని యిచ్చట నురుఁగు బాగుగా పైకివచ్చును ఈలక్షణంబులం దెలిసి ఘృతతైలంబుల గ్రహింపఁదగును

## తైలపాకత్రైవిధ్యము

పాకస్తు త్రివిధో మంద శ్చిక్కణ ఖరచిక్కణః 279
మంద కల్కే కరే సజ్జే చిక్కణో మస్ృణోపమ,
ఖర స్తు స్పర్శమాత్రేణ నిమ్నభావం ప్రపద్యతే 280

చెప్పఁబడిన స్నేహపాకము మృదుపాకమనియుం చిక్కణపాకమనియుం ఖరచిక్కణపాకమనియుం మూఁడువిధంబులు అందు కల్కము చేతి కంటినచో మృదుపాకమనియుం కల్కద్రవ్యముచేతికంటి చిక్కగానుండి మైనమువలె నుండినచో చిక్కణపాకమనియు కల్కము కఠినంబుగానుండి ముట్టినమాత్రముననే క్రింద జాఱిపడినయెడల ఖరచిక్కణపాకమనియుం చెప్పఁబడును

## త్రివిధపాకంబుల కుపయోగములు

మృదు ర్నస్యే ఖరోఽభ్యంగే పానే వస్తౌ చ చిక్కణః,

పైమూడుపాకములలో నస్యమునకు మృదుపాకము అభ్యంగమునకు ఖరపాకము త్రాగుటకు వస్తికర్మకు చిక్కణపాకము, శ్రేష్ఠంబులై యుండును

## సుశ్రుతమతము

సుశ్రుతస్య మతే స్నేహవస్తౌ చ ఖరచిక్కణః 281

సుశ్రుతాచార్యులు స్నేహవస్తియందు ఖరచిక్కణపాకమే శ్రేష్ఠమైనదని చెప్పుచున్నారు

## అతిపాకాపాకదోషములు

దగ్ధోఽతఊర్ధ్వం నిష్ఫార్యం స్యాదామం త్వగ్ని మాంద్యకృత్,
అపక్వం వ్యాధిజనక మతపక్వ మనౌషధమ్ 232
పాకం యత్నాత్పరీక్షేత పాకసిద్ధిస్తు దైవికీ,

పైమూడుపాకములు గాక తరువాత పచనము చేసినచో కల్కము మాడి దగ్ధపాక మగును అట్టి దగ్ధపాకము నిష్ప్రయోజనంబగు ఆమూడుపాకములు గాక పచ్చిగా నుండినచో అగ్నిమాంద్యము జేసి యనేకరోగంబులకు కారణంబగును అట్టి పాకత్రాలము బాగుగా నెఱింగి పక్వము చేయందగును యోగ్యంబగు స్నేహపాక మదృష్టవశంబున గలుగును

## స్నేహపీడనక్రమము

గోచర్మమాత్రం మాలిప్య గోమయేన మహీతలమ్ 283
బ్రాహ్మణాదిక్రమవశా చ్చతుస్త్రిద్వ్యేకహస్తమ్,
మండలం చతురశ్రం వా కుర్యాత్పుష్పవిచిత్రకమ్ 284
అర్చయే దష్టదిక్పాలాన్ గంధపుష్పాక్షతాదిభిః,
తద్వామతస్సువర్ణయుక్తం నవవస్త్రాదివేష్టితమ్ 285
పూర్ణకుంభం ప్రతిష్ఠాప్య దీపితం ఘృతపూరితమ్,
పూర్వస్యాం దిశి విఘ్నేశం గంధపుష్పాక్షతాదిభిః 286

ఉపహారైశ్చ సంతోష్య లాజాపూపఫలాదిభి,
ప్రాగాదిదిక్షు విన్యస్యే త్క్రమేణ వ్రీహి మాషకమ్ 287
ముద్గం కుళుత్థం నిష్పాని సమాషా రాజమాషకా,
తిలం చ సర్వతో వాఽపి క్షిప్త్వాపూజ్యాక్షతాదిభి 288
మధ్యే శాలిభి రాపూర్ణే స్థాపయే త్పాత్ర ముత్తమమ్,
యథాక్రమం తు సంపూజ్య గోవిప్రాన్ప్రా ప్రపూజయేత్
ఘోషయే న్మంగళై ర్వాద్యై ర్వేదఘోషపురస్సరై,
వేష్టితే నవవస్త్రేణ పాత్రే శాల్యుపరి స్థితే 290
సూక్ష్మరజ్వా దృఢం బధ్వా పూర్వాధ క్రమయోగత,
నాతిదృఢం నాతిమందం యుగ్మదండై ప్రపీడయేత్ 291

తా గోమయంబుచే గోచర్మపుమేరభూమి నలికి యందు తైలమును బ్రాహ్మణునకిచ్చునెడల నాల్గుచేతులును, క్షత్త్రియునకిచ్చునెడల మూడుచేతులును, వైశ్యునకిచ్చునెడల రెండుచేతులును శూద్రునకిచ్చునెడల నొకచేయియు, ప్రమాణముగల భూమిని గుండ్రముగా గాని చతుష్కోణంబుగాఁగాని చేసి ముగ్గులువెట్టి యచ్చట నష్టదిక్పాలురఁ బూజించి దానికి నిడమవైపున నవవస్త్రవేష్టితంబై స్వర్ణయుక్తమగు పూర్ణకలశము నుంచి దానిలో నేయి బోసి దీపంబువెట్టి తూర్పుదిశను విఘ్నేశ్వరుని సర్వోపచారంబులఁ జేఁ బూజ యొనర్చి తూర్పుదిశ మొదలన్నిదిశలయందును వ్రీహులు పెసలు ఉలవలుమినుములు, బొబ్బరలు నువ్వులు వీని నుంచి వీనిమధ్యమున శాలిధాన్యము పోసి వాని పైభాగమున నీతైలపాత్రము నుంచి బ్రాహ్మణులను గోవులను నవగ్రహములను పూజించి యనేకమంగళవాద్యములతోడను, వేదఘోషంబులతోడను, తైలపాత్రమును క్రొత్తబట్టచే బంధనము గావించి క్రిందను పైనను సన్నని త్రాడు సామాన్యముగా గట్టి దండద్వయంబుచే నాతైలమును నెమ్మదిగా పిండవలయును

పురాణం వర్జయే ద్వస్త్ర మచ్ఛిన్నం ద్విగుణీకృతమ్,

తైలాదులను వడిఁగట్టునపుడు ప్రాతవస్త్రంబు గూడదు క్రొత్తవస్త్రమును రెండు మడతలుచేసి వడిఁగట్టఁ దగును

ఛిన్నే వస్త్రేథ వా భాండే దగ్ధం స్యా ద్భేషజం తదా
భాండాత్స్రుతేఽపిచ స్నేహే లక్షయే దాయుషః క్షయమ్,

తైలమును వడిఁగట్టినపుడు వస్త్రము చినిఁగినను ఔషధద్రవ్యము మాడినను తైలము పాత్రనుండి కారిపోయినను, రోగికి మరణము సంభవించు నని తెలియందగును

వడియఁబోయఁదగని స్నేహములు

వాశాఘృతం షట్ఫలం చ సుకుమార స్తథైవ చ,
తిక్తం గుగ్గులుతిక్తం చ పంచగవ్యం తథైవ చ 293
అనిస్స్రుతం భవే ద్వీర్యం నిస్స్రుతం నిష్ఫలం భవేత్,

వాశాఘృతము షట్ఫలఘృతము సుకుమారఘృతము తిక్తకఘృతము గుగ్గులుతిక్తకఘృతము, పంచగవ్యఘృతము ఇవి వడియఁబోయకుండనే యుపయోగింపఁదగును వడియఁబోసిన నిష్ఫలంబు లగును

మతాంతరము

బాలస్థవిరరూక్షాణాం కృశానా మల్పరేతసామ్ 294
షట్ఫలం పీడితం కుర్యా త్తథా వాశాదికం స్మృతమ్,

పూర్వపు వాశాదిస్నేహములు బాలురకు వృద్ధులకు రూక్షదేహులకు, చిక్కినవారికి అల్పవీర్యముగలవారికి వడియఁబోసి యుపయోగింపవలయును ఇతరులకు వడిఁగట్టకనే యుపయోగింపవలయును

స్నేహపీడనానంతరక్రమము

తత పరిస్రుతం స్నేహం కించి దాదాయ మంత్రవిత్ 295

హుత్వాఽగ్నౌ విఘ్నరాజాయ సూర్యాయ చ నివేద్యచ,
సౌవర్ణే రాజతే పాత్రే మృణ్మయే వా వినిక్షిపేత్ 296
సలోహమణిభి ర్దర్భైస్సూత్రై౯ కౌతుకబంధనమ్,
క్వాథభాండేచ సిద్ధేచ స్నేహభాండే చ పూజయేత్ 297

ఈప్రకారము సిద్ధముచేసిన తైలము కొలఁదిగా గ్రహించి యగ్నియందు వ్రేల్చి విఘ్నేశ్వరునకును, సూర్యునకును నివేదనఁ జేసి బంగారుపాత్ర యందుఁగాని వెండికుండయందుఁగాని మంటిపాత్రయందుఁగాని, భద్రము చేసి లోహవలయంబుచే బంధించి యుంచి పూర్వపుకషాయపాత్రకును, స్నేహపాత్రకును పూజ యొనర్పం దగును

### మంగళవాద్యాదిఫలము

ఘోషణైస్తృప్తిమాప్నోతి బ్రహ్మావిష్ణుశ్చ శాంతికృత్,
దీపేన భగవా౯ శంభుర్దిక్పాలా ధాన్యరాశిభి 299
అశ్వినౌ పూర్ణకుంభేన మండలేన దివాకర,
మంగళై ర్మణిభిర్లక్ష్మీ స్సోమో పుష్పాక్షతాదిభి 300
తాంబూలదానా త్స ర్వేఽపి తస్మా దుక్తం న లంఘయేత్

వాద్యంబులచే బ్రహ్మ విష్ణువు దీపంబుచే శంభువు ధాన్యరాశిచే దిక్పాలురు పూర్ణకుంభముచే నశ్వినీదేవతలు, మండలంబుచే సూర్యుఁడు, మంగళంబులచేత మణులచేత లక్ష్మి పుష్పాక్షతలచేత చంద్రుఁడు తాంబూల దానముచేత సర్వదేవతలు తృప్తినొందుదురు కాన చెప్పినచొప్పున చేయం దగును

### స్నేహంబున క్షీరావశ్యకత

యత్ర క్షీరాప్రయోగశ్చ తత్ర క్షీరం ప్రయోజయేత్
ఇత్యాహురన్యే మునయస్స్నేహ ఇత్యాహ భాలుకిః,

స్నేహపాకంబున క్షీరము చెప్పకుండినచో నచ్చట కప్పక పాలను ప్రయోగింపఁదగును క్షీరములేని స్నేహము శక్తిహీనంబై యుండును అని భాలుకితంత్రమున చెప్పఁబడెను

ఉక్తానుష్ఠానవిపర్యయంబున దోషము

అజ్ఞానాద్వస్తులోభాద్వా కృతే విధివిపర్యయే 302
రక్షితా అపి నశ్యేరన్ భూతై ర్భేషజశక్తయ,

శాస్త్ర మెఱుంగమిచేఁగాని లుబ్ధత్వముచే గాని పూర్వోత్తరక్రియల యందు విముఖుండైన భూతపిశాచాదులచే నౌషధసామర్థ్యంబులు నశింపఁ జేయబడును కాన పూర్వము చెప్పఁబడిన దేవతాపూజాదులు చక్కఁగ నెరవేర్పవలయును

ధన్వంతరిపూజ

తతో ధన్వంతరిం మత్వా ప్రాణాచార్యం తు భక్తిత 303
అభ్యర్చ్య గంధపుష్పాద్యై రలంకృత్య స్వశక్తితః,
ధాన్యవస్త్రసువర్ణాదీన్ తస్మై సర్వం నివేదయేత్ 304

ప్రాణాచార్యుండగు వైద్యుని ధన్వంతరిమహర్షినిగాఁ దలంచి, గంధ పుష్పాదులచే నలంకరించి, యాధన్వంతరితుల్యుండగు వైద్యునకు ధాన్యము పుట్టంబులు బంగారు మొదలగు ద్రవ్యంబులు దానంబు చేయందగును

---

చ తు ర్థా శ్వా స

అయ మేవ విధి కార్య స్సర్వారిష్టాభయాదిషు,

అరిష్టకల్పనయందును, హారీతకీకల్పనయందును పూర్వముచెప్పఁబడిన విధులనే నిర్వర్తింపవలయును

అరిష్టాదివిశేషము

విశేష పునరేతేషాం విస్తారేణోపదేక్ష్యతే 305

అరిష్టాదులందలి విశేషవిధు లిచ్చట చెప్పఁబడును

## అరిష్టశబ్దవ్యుత్పత్తి

నిర్దిష్టం రిష్ట మశుభ మరిష్టం రిష్టవర్జితమ్

రోగంబులం బోఁగొట్టి శరీరారోగ్యరూపశుభంబు గలిగించుటచే దీనికి నరిష్టంబను నామము సార్థకం బయ్యె

## ఆసవాదుల కరిష్టనామము

అరిష్ట మాసవం క్షౌద్రం లేహ్య మి త్యభిధీయతే 306

ఆసవము క్షౌద్రము, లేహ్యము ఇవి యరిష్టశబ్దంబుచేఁ జెప్పఁబడును

## అరిష్టభేదము

తత్సాంద్రద్రవభేదేన లేహ్యం పేయ మితి ద్విధా,

ఆయరిష్టములలో గట్టిగనుండునది లేహ్యమనియు, ద్రవముగానుండునది పేయయనియు రెండువిధంబుల వ్యవహరింపఁబడును

## లేహ్యపేయగుణములు

పాచనోఽతిగుణో లేహ్య పాక స్యాతిశయత్వత,

పేయ స్స్యా దల్పగుణద సుపక్వ స్తు మహాఫల 308

ఆరెంటిలో లేహ్యము, పాకాతిశయంబువలన పాచనంబై గుణాతిశయంబుగలిగియుండును పేయ మల్పగుణంబై యుండును కాని సుపక్వం బగు పేయంబుగూడ గుణవత్తరంబై యుండును

## అరిష్టాదులయందు కషాయకల్పన

అనిర్దిష్టౌషధజలప్రమాణేషు విశేషత,

అరిష్టాదిషు యోజ్యం స్యా ద్ద్రవ్యా ద్దశగుణం జలమ్

అరిష్టాదులందు జలప్రమాణము చెప్పనిచో ద్రవ్యంబుకంటె పదింతలు నీటిం జేర్పఁదగును

## పాత్రవిశేషము

పాత్రే ష్వాయోమయం శ్రేష్ఠం ప్రాయో లేహ్యాదిసాధనే
విశ్వస్థిష్వరిష్టాదే తత్ర సిద్ధిస్తు జాయతే 310
తదభావే సృఢం శుద్ధం మృద్భాండం పరికల్పయేత్,

లేహ్యాదులం జేయునపుడు ఇనుపపాత్రము శ్రేష్ఠంబైయుండును అట్టి పాత్రంబున గావింపఁబడిన యరిష్టాదులు వీర్యవత్తరంబులై యుండును అట్టి పాత్రము లభింపకపోయెనేని శుద్ధమై దృఢంబగు మంటికుండనైన నుపయోగింపఁదగును

## మృద్భాండదృఢీకరణము

ఉదకాధ్యుషితం కృత్వా మృద్భాండం త్రిచతుర్దినమ్ 311
తతస్సీసాయసద్వైశ్చ స్సమం శతపలోన్మితై,
విధాయ పూర్ణం తోయేన విపచేత్తత్కషాయవత్ 312
తత్రాఽతిదృఢతాంయాతే క్వాథద్రవ్యాణి సాధయేత్,

మంటిబానను మూఁడు లేక నాలుగుదినంబులు నీటిలోఁ దడియుంచి యాబానలో పూర్ణంబుగా నీరుపోసి అందు నూఱుపలములు సీసపురేకులు ఇనుపరేకులు వేసి యిగురఁ గాచవలయును అట్లు కాచిన నాబాన దృఢంబగును ఎమ్మట దానియందు కషాయాదులం గాచఁదగును

## భాండమునందు జలాధిక్యము

సర్వేష్వపి చ భాండేషు చిరకాలాతిసాధనాత్ 313
శుష్యత్యంబు తతో భాండమానాత్పాదాంశ మావపేత్,

అరిష్టాదికషాయంబులను గాఢాగ్నిచే దీర్ఘకాలంబు కాచవలసియుంటఁ జేసి యట్టికషాయము మంటిబానయం దిగిరిపోవును గాన కషాయప్రమాణములో నాలవవంతుజలము అధికముగాఁ జేర్చి కషాయంబును గాచందగును

### ప్రమాణముకంటె జలాధిక్యము

అనేకౌషధసంసర్గా ద్యథోక్తం పరిశుష్యతి 314
తస్మా దౌషధమానా చ్చ పాదాంశం వారి నిక్షిపేత్,

అనేకౌషధములం జేర్చుటచేత ప్రమాణానుసారంబుగా నుదకంబు పోసిన మంటిబానయందు దింకునుగాన జలప్రమాణములో నాల్గవవంతుజలంబు నధికముగా జేర్పందగును

### మతాంతరమున సంసృష్టిమానము

బహుప్రస్థే ద్రవే దేయం ప్రతిప్రస్థం విశుష్యత 315
యోజ్యం సంసృష్టిమానం చ ప్రతిప్రస్థం చతుష్పలమ్,

పెక్కుప్రస్థములు నీరు జేర్చునపుడు మంటిబానయందు దింకునుగాన ప్రతిప్రస్థమున నాలుగుపలముల నీ రధికముగా జేర్పందగు నని కొందఱు నుడువుచున్నారు

### స్నేహాదులందుఁగూడ పూర్వోక్తవిధి

ఏవం భాండాదికం మానం స్నేహేశ్వాధేఽపి శస్యతే
నేష్టం సద్య కషాయేషు పానే పేయాదికేషు చ,

ఈక్రమమున స్నేహాదిపాకంబునగూడ భాండభైషజ్యసంసృష్టిమానం బులఁ బ్రయోగింపందగును కాని సద్యఃకషాయములయందును పానకషాయం బునను పేయకషాయంబునను ఈక్రమముసఁ జేర్పరాదు పూర్వము చెప్పఁ బడిన క్రమముననే సిద్ధముచేయఁదగును

### ఉదకకల్పంబున ప్రస్థభేదము

ద్వాత్రింశత్పలికం ప్రస్థం జలం సామాన్యమానత 317
ద్విగుణం యోజయే దార్ద్రం కుడవాది తథా ద్రవమ్,
ఇత్యాగమేన ద్వైగుణ్యం జలస్యాఽపి ప్రకల్పయేత్ ,318

సామాన్యమానంబున ముప్పదిరెండుపలము లోకప్రస్థ మనంబడును కాన యార్ద్రద్రవ్యములయందును యవద్రవ్యములందు కుడవప్రమాణము మొదలుపై ప్రమాణములందు ఇనుమడి జేర్పందగు ననుశాస్త్రప్రమాణముచే జలమును ద్విగుణంబుగాఁ జేర్పవలయును

మతాంతరము

భాండభైషజ్యమానాభ్యాం పాదం పాదం జలం క్షిపేత్,
సంసృష్టిమానే తు జలం ప్రతిప్రస్థం చతుష్పలమ్ 319
ఇతి కేచిజ్జలస్యాహు ప్రస్థం శతపలాన్వితమ్,

భాండభైషజ్యమానములయందు నాలవపాలు జలంబును, సంసృష్టి మానంబున ప్రతిప్రస్థమున నాల్గుపలంబుల జలంబును జేర్పందగును ఈక్రమమున నూఱుపలము లోకజలప్రస్థమని కొందఱు తంత్రకారులు వక్కాణించెదరు

మతాంతరము

ద్వాత్రింశద్భి పలై ప్రస్థం ద్విగుణీకృత్య తత్పునః 320
భాండభైషజ్యమానాభ్యాం పృథ గష్టపలం జలమ్,
సంయోజ్య తత్ర త్సంసృష్టిమానేన చ చతుష్పలమ్
ఇత్యాహు రపరే ప్రస్థ మశీతిపలసమ్మితమ్, 321

ముప్పదిరెండుపలము లోకజలప్రస్థము ఇది పూర్వశాస్త్రప్రకారము ద్విగుణింపగా నఱువదినాలుగుపలము లోకప్రస్థ మనఁబడును ఇందు భాండభైషజ్యమానంబుల కేఱుగ నెనిమిదిపలములను, సంసృష్టిమానంబున ప్రస్థమునకు నాలుగుపలములనిటిని జేర్పందగును ఈక్రమమున నెనుబదిపలము లోకజలప్రస్థమని కొందఱు చెప్పెదరు

మతాంతరము

అన్యే తు సలిలాధిక్యం దోష మేవ విమృశ్య తత్ 322
ద్వాత్రింశత్పలికే ప్రస్థే ద్వైగుణ్యం న ప్రకల్పయేత్,
భాండ భైషజ్యసంసృష్టిమానే వింశత్పలాన్వితే 323
ద్విపంచాశత్పలమితం జలప్రస్థం ప్రచక్షతే,

సామాన్య మానంబునఁ జెప్పఁబడిన ముప్పదిరెండుపలముల జలప్రస్థము నకు ద్వైగుణ్యము చెప్పఁగూడదు కాని భాండభైషజ్యసంసృష్టమానంబుల యందు ప్రత్యేకముగా నిరువదిపలములు ప్రతిప్రస్థమునకుఁ జేర్పందగును ఈ క్రమమున నేబదిరెండుపలము లొకజలప్రస్థ మని కొందఱు తంత్రకారులు నుడువుచున్నారు

అరిష్టకషాయపాకకాలము

తత్ర త్రిభాగపూర్ణేతు పాత్రే హ్యుత్క్రమాజ్జలైః 324
కఠినం సారమూలాది మధ్యం కాండత్వగాదికమ్,
మృదుపత్త్రఫలాద్యం చ సర్వం త్రేధా విభాజ్య తత్ 325
తులాయామవిధృతం క్షుణ్ణం యథా కాలం వినిక్షిపేత్,
అవిచ్ఛిన్నాగ్నిసంతాపా ద్వింశతి ర్దివసాః పచేత్ 326

పాత్రయందు పూర్వప్రకారము మూఁడుభాగములు నీరువోసి సారము వేళ్లు మొదలగు కఠినద్రవ్యములను, మ్రానిపట్ట మొదలగు మధ్యద్రవ్యములను, ఆకులు, పండ్లు మొదలగు మృదుద్రవ్యములను సరిగాతూచి మెత్తగా దంచి యాపాత్రలోవేసి యిరువదిదినంబు లవిచ్ఛిన్నముగా నగ్నిచేఁ గాచ వలయును

మతాంతరములు

అరిష్టాదౌ కషాయస్య పాకం కేచి త్ప్రచక్షతే,
దివసైః పంచవింశద్భి ర్ద్వావింశద్భి స్తథాఽపరే 327

అష్టాదశభి రన్యే తు తద్వత్ షోడశభి పరే,
తేషాం పక్ష స్తు కరిన మధ్యశ్చ మృద్వౌషధానుగా 328

అరిష్టకషాయంబున పాకము నిరువదిరైదుదినంబులని కొందఱును నిరువది రెండుదినములని కొందఱును పదునెనిమిదిదినంబులనికొందఱును పదునాఱు దినంబులని కొందఱును వక్కాణించెదరు ఈపక్షములన్నియు కరిన మధ్య మృద్వౌషధములకు కనుకూలములని తెలియవలెను

ఆత్రేయమతము

హారీతక్యామరిష్టేషు క్వాథ్యం మాసం పచేద్భిషక్,
ఇత్యాత్రేయేణ నిర్దిష్టం సారాధిక్యాద్య పేక్షయా 329

హారీతకీపాకంబునను అరిష్టపాకంబునకు క్వాథ్యద్రవ్యములను నెలరోజులు కాచవలెను ఎందువలన ననఁగా నీచెప్పఁబడినపాకంబులందు విశేషంబుగా సారాదులను గ్రహింపవలసియుండును అని యాత్రేయమహర్షి చెప్పచున్నాఁడు

అరిష్టకషాయావతరణము

అష్టావశిష్టం తత్కార్య మామత్వా దస్య కేవలమ్,
క్వాథ్యద్రవ్యసమం యద్వా క్వాథం పక్త్వాఽవతారయేత్
శీతీభూతే విమ ర్దైశ్చ తత్కరాభ్యాం క్వథితౌషధమ్,
నిష్పీడ్య కిట్ట ముత్సృజ్య సారం వస్త్రేణ గాలయేత్ 331
తస్య ద్రోణకషాయస్య శుద్ధం శతపలం గుడమ్,
అలోడ్య ఘర్ష యన్ దద్యా ద్ద్వాదశాహం పున పచేత్
పక్షం వింశద్దినం యద్వా పాకం యత్నేన పాలయన్,

పూర్వప్రకారము నీరుబోసి యానీరు పచ్చిదగుటచే నష్టభాగము మిగులునట్లుగాని క్వాథద్రవ్యముతో సమముగాగాని కాచి చల్లబడిన వెనుకనా

కషాయంబును హాస్తంబులతో బాగుగా పిసికి యందలి కరినపదార్థమును తీసి వేసి యాసారమును వస్త్రగాలితముచేసి ముందుచెప్పంబోవురీతి శుద్ధిజేయం బడిన బెల్లమును ఒకద్రోణపు కషాయమునకు నూఱుపలములు గలిపి దానిని బాగుగా గలియ బెట్టుచు పండ్రెండుదినంబులుగాని పదునైదుదినంబులుగాని యిరువదిదినంబులుగాని ద్రవ్యానుసారంబుగాం బచనము చేయుచు నాపాక కాలమును చక్కంగా బరీక్షించుచుండవలెను

—— మతాంతరంబున గుడప్రమాణము ——

చిరస్థాయి ష్వరిష్టేషు పూర్వోక్తద్విగుణం గుడమ్ 332
త్రిగుణం వా చిరతరస్థాయి ష్వి త్యపరే విదు,

అరిష్టాదులు చిరకాల ముండవలసిన చో పూర్వముచెప్పిన పరిమాణముకంటె ద్విగుణముగా గాని త్రిగుణముగా గాని బెల్లము నుపయోగింపందగును అనగా నిన్నూఱుపలములుగాని మున్నూఱు పలములుగాని ప్రయోగింపం దగును

గుడమాక్షికయోశ్శుద్ధి పూర్వమేవ ప్రకీర్త్యతే 333

బెల్లమునకును, తేనెకును శుద్ధి చెప్పంబడును

—— గుడశోధనము ——

యత్కషాయే గుడం యోజ్యం తత్కషాయేన శోధయేత్,
క్వాథాభావే గుడస్యేష్టంజీవంత్యంభసి శోధనమ్ 334
ప్రాచీనకరణే తుల్యం చిత్రకాంబుద్రవం గుడమ్,
నవే తు ద్విగుణం చించాత్వగ్భస్మగుడశోధనమ్ 335
క్వాథ్యమానే గుడం దత్వా సమ్యక్ఫేనోద్యమం పచేత్,

ఏకషాయమున గుడమును జేర్పవలెనో ఆట్టికషాయమున బెల్లమును శుద్ధిజేయందగును ఆట్టికషాయము లేనిచో గూడపాల(రెడ్డివారి వానుబాలు) చెట్టుకషాయముతోనైనను శుద్ధిజేయంజనును మఱియుం బ్రాతబెల్లమును శుద్ధిం

జేయుంనెడల బెల్లముతో సమభాగంబుగాఁ జిత్రమూలకషాయముఁబోసి బెల్లము క్రొత్తదియైన నట్టి చిత్రమూలకషాయంబున బెల్లమునకు రెండింతలు చింతబెరడు బూడిదబోసి నురుఁగు వచ్చువఱకును గాచిన బెల్లము శుద్ధియగును

### మధుపాకము

తోయం క్షీరం సాష్టభాగం మధునోఽత్ర విధీయతే 336
మధుశేషం భవేద్యావత్ తావత్పక్త్వాఽవతారయేత్,
క్షిప్తం జలేనిమగ్నం స్యాదథవా పిచ్ఛిలం భవేత్ 337
వస్త్రేఽథవా విలేపీ స్యాన్మధుపాకస్య లక్షణమ్,

నీరుగాని పాలుగాని తేనెకంటె నెనిమిదిరెట్లుబోసి తేనె మిగులునట్లు కాచవలయును దించినతర్వాత నాతేనె నీటిలోవేసిన మునిగినను, చేతితో బట్టిన బంకవలెసాగినను బట్టకు బాగుగానంటినను సుపక్వంబైనట్లు తెలియవలయును

### అరిష్టాదిపచనక్రమము

సాంద్రం యథా తంతుమత్తా తథా దర్వీ ప్రలేపి చ 338
తథా సుకృష్ణే వి స్తీర్ణే పాత్రే కంసమయే తథా,
హేమాదిలోహమృత్స్నాయాస్స్ఫటికాదిమయే తథా
తత్రాంగుళీద్వయమితం స్వచ్ఛాంభః పరిపూరయేత్,
తాళామ్రాదిదళాగ్రేణ కించిదుద్ధృత్య లేహ్యత 340
బిందుశః పాతయేద్వైద్యస్సమ్యక్పాకపరీక్షక,
తద్బిందుర్లోహమణివత్ యదా మగ్నోన శీర్యతి 341
క్షిప్తముత్తిష్ఠతి యథా సంశుద్ధం బుద్బుదం తత,
వ్యక్తిశ్శుభనిమిత్తానాం ముత్పత్తిర్గంధవర్ణయోః 342
మనః ప్రసాదశ్చ యథా భిషగాతురయో రపి,
తదా సుపక్వం విజ్ఞేయం శీఘ్రమేవావతారయేత్ 343

మధ్యే గోమయగర్తస్య సలిలేన ద్రవీకృతే,
సిక్తేవా సికతారాశౌ తథార్ద్రితృణవిస్తృతే 344

కాచిన లేహ్యారిష్టపాకము చిక్కఁబడి దారములువలె తీగలుసాగుచు త్రెడ్డున కంటుటనుగాంచి తరువాత కంచుపాత్రమునఁగాని, బంగారు మొదలగు లోహపాత్రమునగాని మంటిపాత్రమునగాని, స్ఫటికపాత్రమునగాని రెండంగుళములవఱకు నీరుపోసి యందునీ లేహ్యపాకమును తాటియాకుతోఁగాని, మామిడియాకుతోఁగాని తీసి యాపాత్రమునందలి నీఁటిపై బోసినయెడల నాలేహ్యపుబిందువులు మునిగి విడిపోకయుండి యెత్తిపోసిన గొడుగెత్తియుం బుడగలులేచుచు నిట్టి మంచిగుణముల గాన్పించి మంచివాసనగలిగి రంగునిర్మలంబై రోగికిని వైద్యునకును మనఃప్రీతి గల్గించిన నో సుపక్వంబైనదని తెలిసికొని తరువాత నాపాకపాత్రమును గోమయంబుచే గోయిచేసి యందుఁ గొలఁది నీరుపోసి యాగోయియందుగాని, తడపినయిసుకయందుగాని, పచ్చికసవునందుగాని దింపవలయును

మతాంతరము

దర్వీప్రలేపా దథ బుద్బుదాద్వా
న కేవలం పాకవిధౌ ప్రమాణమ్,
క్షిప్తం జలే మజ్జతి చేత్ప్రమాణమ్
అగ్నౌ సుగంధం ప్రవదంతి కేచిత్ 345

త్రెడ్డునంటి బుడగలుగట్టినంతమాత్రమున సుపక్వమైనదని యెఱుంగఁ గూడదు ఆలేహ్యము నీటిలోవేసిన మునిఁగినను నిప్పుపైవేసిన సుగంధముగల్గినను సుపక్వమైనదని తెలియందగు నని కొందఱు చెప్పుచున్నారు

అప్రాప్తపాక మంగారే స్థాపయిత్వా పున పున
సుపక్వ మవతార్యాఽస్మిన్ ప్రతివాపం వినిక్షిపేత్ 346

బాగుగా పాకము రానిచో నద్దాని నిప్పుపైనుంచి మంచిపాకము వచ్చినతోడనే దించి యాలేహ్యమున ప్రతివాపమూర్ణమును గలుపందగును.

## ప్రతివాపచూర్ణము

సంస్కారవత్తు తద్ద్రవ్యం ద్రవస్యాఽష్టమభాగికమ్,
దశభాగం వదం త్యన్యే కేచిత్ షోడశభాగికమ్ 347
తస్మిన్ వినిక్షిపే చ్చూర్ణం ప్రతివాపం శనైశ్శనైః,

సంస్కృతంబగు (శుద్ధిచేయబడినదై చూర్ణముచేయబడిన) ద్రవ్యము ప్రతివాపం బనఁబడును ఆట్టి ప్రతివాపచూర్ణమును ద్రవద్రవ్యమునకు ఎని మిదవపాలుగాని పదియవపాలుగాని పదునాఱవపాలుగాని కలుపవలయును అని మూఁడు మతములు గలవు

## ఉపచారకృత్యము

ఆదౌ ద్రవ్యం తు తత్సర్వ మవిచ్ఛిన్నం విఘర్షయన్ 348
పిండాన్ శిథిలయన్ భాండలగ్నం చ ముహు రుల్లిఖన్,

ప్రతివాపచూర్ణము కలిపినతర్వాత నాచూర్ణమును చెదరకుండ త్రెడ్డుతోఁ గలియఁబెట్టుచు నుండవలెను చూర్ణపుటుండలను విడఁగొట్టుచు బాన నంటకుండఁ గలియఁబెట్టవలయును

## పేయారిష్టపాకలక్షణము

పాకే తు పేయారిష్టస్య యదా దర్వీ ప్రలేపితా 349
రక్తానాం బుద్బుదానాం చ సముత్పత్తి ర్యదా భవేత్,
క్షౌద్రస్యేవ యదాఽత్యల్ప తనుఫేనప్రదర్శనమ్ 350
సంస్పర్శే తు యదాఽంగుళ్యా తంతుమత్తా చ జాయతే,
తదా సుపక్వం విజ్ఞేయం సద్య స్తదవతారయేత్ 351

పేయారిష్టపాకంబున ద్రవ్యము తెడ్డున కంటితేనెవలె యెఱ్ఱ బుడగలురాఁగాఁజూచి వ్రేలితో ముట్టిన దారంబువలె సాగినతోడనే సుపక్వం బైనదని తెలిసి త్వరలో పొయినుండి దింపవలయును

### పేయారిష్టమున ప్రతీవాపచూర్ణము

లేహ్యపాకే ప్రతీవాపచూర్ణం యావ దుదాహృతమ్,
తావదర్ధం ప్రతీవాపం పేయారిష్టే తు కల్పయేత్

పేయారిష్టములందుఁ గలపు ప్రతీవాపచూర్ణమును లేహ్యములందుఁ జెప్పఁబడిన ప్రతీవాపచూర్ణములో సగము గలపవలయును

### పాత్రాంతరక్షేపణక్రమము

ప్రతీవాపితచూర్ణం తత్ క్షిప్రం పాత్రాంతరే క్షిపేత్,

ప్రతీవాపచూర్ణమును గలిపినతోడనే యా పేయారిష్టమును మఱియొకపాత్రమునందు పోయందగును

### పాత్రాంతరనియమము

స్నేహారిష్టాదయ స్తస్మాత్పాత్రాత్ క్షిప్రమనుద్ధృతా
తదా భవం త్యతిక్రాంత పాకా ప్రక్షీణశక్తయ,

తైలంబులను అరిష్టాదులను మఱియొకపాత్రమునఁ బోయనివోఁ దగ్ధపాకంబులును నిర్వీర్యంబులును నగును

### భాండవిశేషము

కుంభం విశేషత కుర్యా దరిష్టానా మయోమయమ్

అరిష్టాదులను నిలువచేయుటకు నినుపబాన నుపయోగింపవలయును

లోహాభావేతు మృద్భాండం యథోక్తక్రమసంస్కృతమ్

లోహపాత్రము లేనిచో చెప్పఁబోవుప్రకారము గట్టిచేయఁబడిన మంటిపాత్రమునైన నుపయోగింపఁదగును

### మృద్భాండదృఢీకరణము

ప్రాక్తోయక్షీరమధ్వాజ్యతైలాద్యేకదినోషితమ్,

పంచవల్కకషాయేషు చిత్రకక్వథితేషు వా 355
తతో బిల్వకపిత్థామ్రతులసీమాతులుంగజైః,
పత్రైః కుశైశ్చ బహుశో ఘర్ష యేదాతపే శుచిపేత్
బహిరంతశ్చ సంఛన్నం జంతునా పరివర్జితమ్,
వేష్టితం దృఢవస్త్రేణ చర్మణా వల్కలేన వా 357
రజ్జుభిస్త్రిగుణై ర్వేత్రదళైర్వంశత్వచాఽథవా,
బధ్నీయాన్మురజాకారం గవాక్షాకృతి వా దృఢమ్ 358
శీతోష్ణవాతమశకకీటలూతాదిశాంతయే,
యథోక్తైశ్చూర్ణితైర్ద్రవ్యైర్యద్వాఽగ్నిమగధోద్భవైః
నాత్యల్పసాంద్ర మేవాంతర్లిం పేత్పక్వమధుప్లుతైః,
వాసితం వివిధై పుష్పైస్సుగంధైశ్చంపకాదిభి 360
గుగ్గుల్వగరుచూర్ణేన ఘృతయుక్తేన ధూపయేత్,
లవంగం జాతికోలం చ కుంకుమం కంటకీఫలమ్ 361
త్రిజాతకం చ కర్పూరం కస్తూరీ మృగనాభికమ్,
శ్లక్ష్ణపిష్టైస్తు తై పశ్చాత్ కర్షమాత్రైః ప్రలేపయేత్
అరిష్టం శీత మన్వేద్య పక్వ క్షౌద్రాం శమిశ్రితమ్,
ఏవం సుసంస్కృతేభాండే త్ర్యంశమాత్రం వినిక్షిపేత్

అరిష్టాదులం బోయుటకు మంటిపాత్రము మొదట నీరు ఎమ్మట పాలుపోసి అనంతరము తేనె, నేయి నూనె వీనింబోసి యొక్కొక్కదినం బుంచవలయును ఎమ్మట పంచవల్కల (మఱ్ఱి మేడి రావి జువ్వి ప్రబ్బలి వీని పట్టలు పంచవల్కలము లనఁబడును) కషాయంబులుగాని చిత్రమూలకషాయంబుగాని కావలయును తర్వాత మారేడాకు వెలగయాకు, మామిడి యాకు తులసియాకు, మాదీఫలపుయాకు దర్భ వీనిచే కుండలోన బాగుగా తోమవలయును ఎమ్మట కుండయం దెచ్చటను పురుగులం లేనట్లు శోధించి

దృఢంబగు వస్త్రంబుచేఁగాని చర్మముచే గాని పట్టుచేఁగాని బానపైభాగమున గప్పి మూఁడుపేరులువేసిన త్రాళ్ళఁగాని, పేకుచంగాని, వెదురు బ్రద్దలఁగాని మద్దెలవలెగాని, గవాక్షముఁబోలిగాని దృఢముగాఁ గట్టవలయును తరువాత నాబాన నెండ గాఁ బెట్టవలయును అనంతరము శీతవాతము ఉష్ణవాతము, దోమలు, పురుగులు లూతములు ఇవి నశించు నిమిత్తము చిత్రమూలము, ఎప్పళ్లు వీనిని తేనెతోఁ గలిపి పూయవలెను అనంతరం బాకుండను వివిధ చంపకాదికుసుమంబులచే పరిమళింపఁజేసి గుగ్గిలము అగరు వీనిని నేయితోఁ గలిపి ధూపము వేయవలెను ఎమ్మట లవంగము, జాజికాయ, తక్కోలాలు, కుంకుమపువ్వు కరాంబువులు (గొట్టెగింజలు) త్రిజాతకములు, లవంగపట్ట, ఏలకులు లవంగపత్త్రము కర్పూరము కస్తూరి వీని కర్షప్రమాణముగా నొక్కొక్క దాని దూది మెత్తగానూరి యాబానలోన పూయందగును అనంతరంబున నది బాగుగా నారినతోడనే రెండవనాఁ డరిష్టమున వెనుక జెప్పినట్లు కాచిన తేనె భాగానుసారముగా గలిపి కుండకు మూఁడుభాగములు బోసి జాగ్రత వేయందగును

### అరిష్టంబుల గుడక్షౌద్ర ప్రమాణము

అరిష్టేషు చ సర్వేషు ద్రోణే శతపలం గుడమ్,
మాక్షికం చ గుడ స్యార్ధం యోజయేన్మతిమాన్ భిషక్

ద్రోణప్రమాణంబుగల యరిష్టంబున నూఱుపలముల బెల్లము గలుపఁ దగును ఆబెల్లములో సగము తేనె గలుపవలయును

### మతాంతరము

క్షౌద్రాజ్యతైలాన్యేకధ్యం ద్విశైశ్చైకైకశోఽపి వా,
యథాదోషం యథాసాత్మ్య మరిష్టాదిషు యోజయేత్

తేనె, నెయ్యి నూనె వీనిని అన్నియుఁ గలిసి రెండుభాగములుగాని, యొక్కొకభాగముగాని దోషానుసారంబునను సాత్మ్య (అభ్యాసము) ను సారంబునను అరిష్టాదులం గలపందగు

### అరిష్టభాండమునకు ధాన్యనిక్షేపణము

అధోముఖ శరావేణ ముఖ మస్య పిధాయ చ,
వస్త్రేణ సుదృఢంబధ్వా లిప్తం సుశ్లక్ష్ణమృత్స్నయా
ప్రాగీశానదిశోర్మధ్యే ధాన్యరాశౌ సమర్పితే,
హస్తమాత్రనిమగ్నం తత్కుంభం స్థిరతరం న్యసేత్
అరిష్టలేహ్యపథ్యాద్యా నిఖాతా ధాన్యరాశిషు,
వీర్యం తదూష్మణా యాంతి పక్షాద్వా మాసతోఽపివా
ధాన్యమధ్యే స్థితం సర్వం తదరిష్టాభయాత్మకమ్,
రసాధిక్యం గుణాధిక్యం జంతుదోషాదివర్జితమ్ 369
శీతోష్ణవాతైరస్పృష్టం సుపక్వ మమృతాయతే,
భేషజాకాంక్షిభిస్సర్వైర్దిక్పాలైర్దనుజైర్గ్రహైః
భూతైః ప్రేతైః పిశాచైశ్చ న కదాఽప్యభిభూయతే,

ఆయరిష్టభాండమునకుపైన మూకుడు బోర్లించి దృఢంబగువస్త్రము గట్టి సంధిబంధనము గావించి తూర్పు ఈశాన్యము, ఈదిక్కుమధ్యంబున ధాన్యరాశియందు చేయిలోతు త్రవ్వి యందు నీయరిష్టపాత్రము నుంచికప్పవలెను ఇట్లొనర్చిన పక్షంబునకుఁగాని మాసంబునకుఁగాని యాయరిష్టాదులందలియుక్కచే మగ్గి వీర్యవత్తరంబులై యుండును మఱియు ధాన్యరాశి నిక్షేపణంబుచే నాయౌషధములకు రసా (రుచి) ధిక్యము గుణాధిక్యము గలుగును అందుఁ గ్రిమిదోషంబు చేరకుండును శీతోష్ణవాతసంబంధము లేకుండును దిక్పాలురు, రాక్షసులు గ్రహములు, భూతములు ప్రేతములు పిశాచములు చేరకుండును

### అరిష్టోద్ధరణక్రమము

తదా సుపక్వం విజ్ఞాయ తదరిష్టం సముద్ధరేత్ 371
ధాన్యస్థకుంభముఖతస్సుగంధం చ యదా భవేత్,

పూర్వము చెప్పఁబడిన దినములు గడచిన వెనుక నాయరిష్టకుంభము నుండి మంచివాసనవచ్చినతోడనే యది సుపక్వమయ్యెనని యెఱింగి యా ధాన్యరాశినుండి తీయందగును

## వైద్యపూజ

సంపూజ్యగంధపుష్పాద్యైర్వైద్యం వస్త్రైశ్చభూషణైః
అరిష్టాధ్యుషితం ధాన్యరాశిం తస్మై సమర్పయేత్,
ఔషధాని రసాన్ సర్వాన్ ఘృతతైలగుడాదికాన్
నివేదయంతి వైద్యస్య సాధకో గురువత్సల,
రోగార్తో వాఽపి వా రాజా జ్ఞానారోగ్యయశోఽర్థిన
తృతీయాంశం చతుర్థంవా నోచే ల్లోభేన మందధీ,
తూష్ణీంభావం తు య కుర్యాత్తస్య సిద్ధి ర్నజాతుచిత్

పిమ్మట వైద్యుని గంధపుష్పాక్షతలచేతను, వస్త్రభూషణంబులచేతను బూజించి యాయరిష్టకుంభము నుంచినధాన్యమును వైద్యున కీయందగును మఱియు సిద్ధము చేయంబడిన యౌషధంబులలో మూఁడవభాగముగాని, నాలవ భాగముగాని వైద్యున కర్పింపవలయును అట్లు దానంబు జేసిన శిష్యునకు జ్ఞానాభివృద్ధియు, రోగికి నారోగ్యంబును, ప్రభువునకు కీర్తియుం గలుగును ఉపేక్షచేసినచో నాయౌషధాదులు నిష్ఫలంబులై కార్యసిద్ధిఁ జేయకుండును

## జలాధిక్యన్యూనతాదోషము

జలాధిక్యే బహుళతా దౌర్గంధ్య మచిరస్థితి,
న్యూనే జలే త్వల్పవీర్యంశోష స్తృష్ణా చ జాయతే

అరిష్టాదులయందు జల మధికమైనచో పచ్చిలంబై దుర్గంధముకలదై శీఘ్రకాలముననే చెడిపోవును జలము తక్కువయైనచో శక్తి తగ్గును అట్టి యరిష్టమును భక్షించిన శోషము దప్పి గలుగును

### భేషజాధిక్యన్యూనతాదోషము

హృచ్ఛూలం భేషజాధిక్యే౽ప్యజీర్ణం త్వామరోగకమ్,
న్యూనే చ భేషజే శక్తేర్హాని ర్వహ్నేశ్చమందతా

అరిష్టాదులయందు భేషజద్రవ్య మధికమైనచో హృదయంబున నొప్పి, యజీర్ణము, ఆమరోగములు గలుగును భేషజద్రవ్యము తక్కువయైన శక్తిహీనమై యగ్నిమాంద్యము జనించును

### స్వరసాధిక్యన్యూనతాదోషము

వైరస్యం స్వరసాధిక్యే వైవర్ణ్యం క్రిమిసంభవ,
న్యూనే తు స్వరసే దోష శక్తిహానస్తు జాయతే

అరిష్టాదులందు స్వరస మధికమైన రుచిచెడి వివర్ణంబై పురుగులు పట్టును స్వరసము తక్కువయైనచో నిర్వీర్యంబగును

### గుడాధిక్యన్యూనతాదోషము

గుడాధిక్యే త్వభిష్యందో వైరస్యం క్రిమికోష్ఠతా,
హీనే గుడే భవే చ్ఛోఫ నిర్వీర్యత్వమవర్ణతా 379

అరిష్టాదులందు బెల్ల మధికమైనయెడల రుచిచెడి యభిష్యందరోగము క్రిమికోష్ఠ (కడుపు గోపురుగులు) రోగము జనించును బెల్లము తక్కువయైన నిర్వీర్యంబై వర్ణహీనం బగును ఆట్టిదానిం భక్షించిన నంజురోగము జనించును

### క్షౌద్రాధిక్యన్యూనతాదోషము

క్షౌద్రాధిక్యే వాతదోషః కార్శ్యం దాహోబలక్షయః
న్యూనే క్షౌద్రే తు దౌర్గంధ్యం వైవర్ణ్యం హీనశక్తితా

అరిష్టాదులయందు తేనె యధికమైన వాతప్రకోపము, చిక్కుట, దాహము బలహాని కలుగును తేనె తక్కువయైనచో వర్ణరహితంబై దుర్గంధము గలిగి నిర్వీర్యంబగును

—— ప్రతీవాపాధిక్యన్యూనతాదోషము ——

శక్తిహాని ప్రతీవాపాధిక్యే శోషోఽచిరస్థితి
న్యూనే పున ప్రతీవాపే వహ్నినాశోఽల్పవీర్యతా

అరిష్టాదులయందు ప్రతీవాపద్రవ్య మధికమైన చిరకాలము నిలువ యుండదు అట్టిదానిని భక్షించిన శోషగల్గును ప్రతీవాపద్రవ్యము తక్కువ యైన నల్పవీర్యంబై యగ్నిమాంద్యమును గలుగఁజేయును

—— స్నేహాధిక్యన్యూనతాదోషము ——

స్నేహాధిక్యే గౌరవంస్యాత్స్నేహన్యూనేఽల్పశక్తితా,

అరిష్టాదులందు స్నేహమధికమైన గురుత్వముగలిగి శీఘ్రముగా జీర్ణము కాకుండును స్నేహ మల్పమైనయెడల నరిష్టాదు లల్పవీర్యంబులై యుండును

—— అరిష్టప్రభావము ——

ఇత్యేతైర్వర్జితం దోషైరశేషగుణసంభృతమ్ 333
యథాకాలప్రయుక్తం త దరిష్టం సర్వరోగజిత్,

ఇట్టి న్యూనాధిక్యదోషంబు లేకుండ యథాశాస్త్రముగా సిద్ధముచేయబడి కాలానుసారంబుగా నుపయోగింపఁబడినయరిష్ట మత్యుత్తమగుణసంభృతంబై సర్వరోగంబులును నశింపఁజేయును

వక్ష్యతేఽత పరం సమ్యగభయాయాశ్చలక్షణమ్ 334

హరీతకపాకలక్షణము చెప్పఁబడును

—— శ్రేష్ఠమానహరీతకి ——

నవా వృత్తా ఘనా స్నిగ్ధా గుర్వీ మజ్జతి చాప్సు యా,
కర్షప్రమాణీ శ్రేష్ఠా స్యాద్వర్జ్యా న్యూనా తతోఽవరా
న చ ద్విగుణసంయుక్తా తథైవ ద్విత్రికర్షకా,

క్రొత్తదియై వర్తులంబై మెఱయుచు బరువుగలిగి కర్షప్రమాణమునకు తక్కువకాకయుండు కరకకాయ శ్రేష్ఠంబుగనుండును అంతకు తక్కువైనది

శ్రేష్ఠముగాదు మఱియు కర్షద్వయము కర్షత్రయము ప్రమాణముగాన శ్రేష్ఠముగాదు

హారీతకీభేదములు

నదీతీరభవా వన్యా పార్వతీయేతి సా త్రిధా 386
యధోత్తరం పథ్యతమా ప్రయోజ్యా సర్వకర్మసు,

కరకకాయ నదీతీరభవ (ఎటియొడ్డున పుట్టినది)యనియు, వన్య(అడవియందు బుట్టినది) యనియు, పార్వతీయ (పర్వతంబున బుట్టినది) యనియుం మూఁడువిధంబులై యుండును అందు మొదటిదానికంటె రెండవదియుం రెండవదానికంటె మూఁడవదియు శ్రేష్ఠతమంబై యుండును కాన పర్వతంబున బుట్టినకరకకాయయే సర్వక్రియలయందును బ్రయోగింపఁజనును

మతాంతరము

పథ్యానాం తీరజాదీనాం త్రైత్రైకద్విత్రినిష్కతా 387
మానం యథాక్రమం విద్యా దితి కేచిత్ప్రచక్షతే,
నిష్కప్రమాణహీనాస్తు నిర్వీర్యాస్తాః ప్రకీర్తితా 388

పూర్వముచెప్పఁబడిన మూఁడిటిలో మొదటిది నిష్కప్రమాణముగలదిగను రెండవది రెండునిష్కములు ప్రమాణముగలదిగను మూఁడవది మూఁడునిష్కములు ప్రమాణముగలదిగను నుండును నిష్కప్రమాణమునకును తక్కువదైనది నిర్వీర్యమైయుండును కాన నట్టిదాని నుపయోగింపందగదని కొందఱు చెప్పుచున్నారు

హారీతకీమానము

దశాభయా పలం విద్యాత్తదా దశపలం శతమ్,
శతం పలం హారీతక్యా స్సహస్ర మితి కథ్యతే 389
అభయానాం దశపలం ప్రస్థ మిత్యపరే విదు,
అభయానాం సహస్రేణ తులామానం భవే దపి 390

తాః పచేత్తునిమజ్జంతి యాః క్షణం లోహవజ్జలే,

పది కరకకాయ లొకపలమనఁబడును నూఱు కాయలు పది పలము లనఁబడును వేయి కాయలు నూఱు పలము లనఁబడును పది పలములకాయ లొకప్రస్థమనియుం వేయి కాయ లొకతులయనియుం చెప్పఁబడును అట్టి కాయలు నీటిలో నినుపముక్కవలె మునిగినచో శ్రేష్ఠంబులై యుండును గాన నట్టివానిని పచనము చేయఁదగును

## మతాంతరము

పథ్యానాం తు సహస్రేణ తులామానం భవేత్తథా
తోయమగ్నాభి రన్యాభి స్తులామానం ప్రపూరయేత్,
తులామానం సహస్రేణ పథ్యానా మధికం యది 392
అధికాంస్తాంస్తు సంగృహ్య తులామాన మిహోచ్యతే,

వేయి కరకకాయ లొకతులయనఁబడును అట్టి తులప్రమాణముచేఁ దూచిన వేయికి తక్కువయైనచో మిగిలినకాయలచేఁదు ల్యామానమును బూరింప వలయును మఱియును తులాప్రమాణమునం దధికమైనచో మిగిలిన కాయలం ద్యజింపందగును జలమగ్నంబులగు వేయికాయలు తుల యని తాత్పర్యము

## గోమూత్రపచనక్రమము

నవాదిగుణసంయుక్తా స్సంశుష్కాశ్చహరీతకీ 393
ప్రక్షాళ్యపటపూతేత్తు గోమూత్రేచ వినిక్షిపేత్,
అహోరాత్రం నిమగ్నాస్తాః పరేఽహని సముద్ధృతా,
తీక్ష్ణాగ్రాభిశ్శలాకాభి ప్రతుద్య బహుశో దృఢమ్,
అర్ధాంగుళాంతరచ్ఛిద్రా గోమూత్రే తత్ర తా పృథక్ 395
దర్వ్యావిఘృష్య విపచేన్నిర్జలం మృదునాఽగ్నినా,
క్షిప్త్వా స్వేషు కషాయేషు ప్రతుద్య స్థాపయేత్తథా 396

పూర్వము చెప్పఁబడిన నవాదిగుణంబులుగల కరకకాయలను కడిగి గోమూత్రమున నొకదినంబుంచి మఱునాడు వాడిగలిగిన యినుపమేకుల చే సర్ధాంగుళప్రమాణముగ రంధ్రములుచేసి యిమ్మట మరల గోమూత్రంబునఁ బోసి త్రెడ్డున గలియఁబెట్టుచు నామూత్రము హరించుపఱకుఁ గాచవలెను లేకనే యే యరిష్టకషాయమున వండవలెనో ఆకషాయమందే నానఁబెట్టి ఛిద్రములు చేయవలెనని పక్షాంతరము

మతాంతరము

చతుర్గుణేతు గోమూత్రే వహ్న్యావ్యక్షణ్యను తాప్యతా,
పథ్యా ప్రతుద్య సూచీభి తస్మిన్నేవ పున పచేత్
దర్వీప్రలేపనాదేవ ప్రలిప్యంతి యదాఽభయా,
తదా సర్వాస్సముల్లిఖ్య క్షిపేత్క్వాధే గుడం పచేత్
ఇత్యాహు రేకే మునయ పథ్యానాం శోధనక్రమమ్,

కరకకాయలకంటె నాల్గింతటిగోమూత్రముపోసి వాని నగ్ని వేఁడమి యం దుడుకబెట్టి యిమ్మట వానికి సూదులతో రంధ్రంబులుచేసి మరల గోమూత్రంబునబోసి త్రెడ్డుచేఁ గలియంబెట్టుచు నాకరకకాయలు త్రెడ్డునకంటిన తోడనే తీసి చెప్ప బడిన కషాయంబునంబోసి బెలము కలిపి పచనముకావింప వలయు నని కొందఱు తంత్రకారులు చెప్పుచున్నారు

సంస్కృతహారీతకీవ్యవహారము

ఏవంవిధాస్తు పథ్యాస్తా స్సంస్కృతా జర్ఝరీకృతా
గోమూత్రక్షాళితా స్స్విన్నా స్స్వేషు తంత్రేషు కీర్తితా,

ఈరీతిగా గోమూత్రక్షాళితంబులై రంధ్రములు చేయంబడి స్వేదితంబులగుకరకకాయలు సంస్కృతహారీతకు లని తంత్రంబుల వ్యవహారింపఁబడును

అభయాపాకక్రమము

అరిష్టోక్తవిధానేన క్వాధేషు సగుడేషు తు 400
హారీతక స్తాః ప్రక్షిప్య ద్వాదశాహం పున పచేత్,

తర్వాత నానసంస్కృతహారీతకులను అరిష్టాదులంబోలె కషాయంబులం బోసి బెల్లముగలిపి పండ్రెండుదినంబులు పాకంబు గావింపవలయును

## అభయాపాకలక్షణము

నిరుద్ధబుద్బుదం పాకే హ్యభయానాం ప్రవర్తతే 401
తస్యా పరమసంప్రాప్తిః పథ్యాపాకస్య లక్షణమ్,

అభయాపాకంబున బుగ్గలు అణంగినచో సుపక్వమయ్యె నని తెలియందగు

## మతాంతరము

అన్యే పునర్వదంత్యేవం పథ్యాం సంపీడ్య తద్ద్రవై
వర్తిః ప్రలిప్తా నిశ్శబ్దం పాకే జ్వలతి దీపవత్,

ఉడికినహారీతకిని చేతిలోఁ బిసికి యాద్రవమును వర్తికిఁ బట్టించి యావర్తిని దీపంబుపైగాల్చిన నది శబ్దములేకుండ గాలినచో సుపక్వంబైన దని యెఱుంగునది

## మతాంతరము

హారీతకీం తు నిష్పీడ్య తద్ద్రవం స్రావయేజ్జలే 404
ద్రుతం మజ్జతి చేత్పక్వలక్షణం ప్రాహురుత్తమమ్,

ఉడికినహారీతకిని చేతిలోఁబిసికి యారసమును నీటిలోఁబోసినతోడనే నయ్యది మునిగిన సుపక్వమయ్యెనని తెలియందగు నని కొందఱు వక్కాణించుచున్నారు

## ధాన్యరాశిస్థాపనము

అరిష్టవత్సుపక్వాం తామవతార్య యథోదితమ్ 405
పథ్యాచూర్ణం ప్రతీవాప్యం సితాం చ మధుమోదితమ్,
ధాన్యరాశిస్థితం కృత్వా సముత్క్షిప్య నిధాపయేత్ 406

ఈరీతిని సుపక్వంబైన యీహారీతకియందు ప్రతీవాపముగాకరకచూర్ణంబు గలిపి ఎమ్మట పంచదార, తేనె వీనింబోసి యనంతరము ధాన్యరాశియందుఁ బక్వమైనతోడనే తీయందగును

◆ ధాన్యపాకలక్షణము ◆

హారీతక్యస్థిసంఛిన్నం తన్మజ్జాంజనసన్నిభమ్,
భవేద్యదా తదా ప్రోక్తం ధాన్యపాకస్య లక్షణమ్

ధాన్యరాశిం బెట్టఁబడిన హారీతకియందలివిప్పువీడి కాటుకవలెనైనచో ధాన్యరాశి పాకంబయ్యెనని యెఱుంగునది

◆ అభయాపాకంబున క్షౌద్రనిక్షేపణము ◆

హారీతకీనాం సర్వాసామూర్ధ్వం మాసత్రయాత్పున,
క్షౌద్రప్రక్షేపణం కార్యం తదా పాక స్సునిశ్చిత 408

ఇతి చతుర్థాశ్వాసః

ఈరీతిని పాకంబుగావింపఁబడిన హారీతకియందు మూఁడుమాసంబుల పిమ్మట తేనె గలపందగును అట్టియిన సంసిద్ధంబగు హారీతకీపాకంబనంబడును

భేషజకల్పము సంపూర్ణము

---

చెన్నపురి వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
వావిళ్ల ప్రెస్సున ముద్రితము — 1950

# విషయసూచిక

## ద్వితీయాశ్వాసః



## తృతీయాశ్వాస

# విషయసూచిక